గంగిరెడ్డి లక్ష్మీనారాయణ

వచనకవిత
కావ్యం

# మట్టి వెలుగు

శీల వీర్రాజు




ప్రచురణ : రిజిష్టర్డ్ సంఖ్య 1/64

సాహితీ సాంస్కృతికసంస్థ, 5. కింగ్స్‌వే, సికిందరాబాదు

ప్రచురణ : 13

ప్రథమ ముద్రణ : 3000 ప్రతులు

1973 ఏప్రిల్ 4, ఉగాది

ముఖపత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ ;

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖపత్ర ముద్రణ;

విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3.

వెల : 4 రూ.లు

# 'మళ్ళీ వెలుగు'తో

# ముందుకు....




'మళ్ళీవెలుగు' ఇది యువభారతి పదమూడో ప్రచురణ. పదో వసంతంలో అడుగిడుతున్న సందర్భంగా వెలువడుతున్న కావ్యం. వాస్తవ జీవితానికి నిలువుటద్దం.

యువభారతి ఏ రాజకీయ సిద్ధాంతానికో, ఏ ఆర్థిక విధానానికో, ఏ వ్యక్తిగత ధోరణికో కట్టుబడిఉన్న సంస్థకాదు. తెలుగుప్రజల్లో సాహిత్యంపట్ల ఆసక్తిని, స్నేహభావాన్ని, భాషాప్రియత్వాన్ని పెంపొందించడమే యువభారతి లక్ష్యం. కొత్తసూర్యుడు, పాతసూర్యుడు, కొత్తమనసు-పాతమనసు, కొత్తఅందం-పాత అందం లేవు. రాగద్వేషాలు హృదయలక్షణాలు. అవి కవిత్వావిర్భావానికి హేతువులు. మారేవి బాహిర పరిస్థితులు. అంతరంగం రాగద్వేషాలకు రంగస్థలం. కవిత్వంలో కొత్తపాతలు చూడటం విశ్లేషణారీతి. అనుభూతి కాదు. కనుక కవిత్వానికి కొత్తపాతలు లేవు. సహృదయుల హృదయాలను రసార్ద్రం చేసే ప్రయత్నంలో ప్రతిపద్యం ఒక ప్రయోగమే. ప్రతి వాక్యం ప్రయోగమే. గద్యకవిత, పద్యకవిత అనే వింగడింపులు కేవలం చర్చకోసమే; విషయవిపులీకరణం కోసమే. అచ్చమయిన కవిత్వానికి పద్య గద్యాలు కేవలం బాహిరరూపాలు. పద్యమే కవిత్వమనీ, గద్యం కాదనీ ఏ లాక్షణికుడూ నిన్న అనలేదు. ఇవాళ అనడంలేదు. పద్యం రాసేవాళ్ళు, పద్యంపైన మోజున్నవాళ్ళు పాతకాలంనాటివాళ్ళు కారు. మనస్సును ఉవ్వెత్తుగా ఎగరవేసిన భావానికి అక్షర రూపకల్పన చేయవలసివచ్చినప్పుడు శబ్దాలు, లయాన్వితమౌతాయి. అదే ఛందస్సు. అంతేకాని ఛందస్సు అంటే ఉత్పలమాల, నర్కుటం, గోమూత్రికా నాగబంధాలుకావు. గద్యకవిత అంటే ఒకపంక్తి చిన్నది మరొకపంక్తి పెద్దదిగా వ్రాయడంకాదు. వాక్యం రసాత్మకం కావాలి. అందమైన అర్థాన్ని వాక్యం ప్రసాదించగలిగితే అది రసాత్మకమౌతుంది. భావస్ఫూర్తిగల వాక్యంలోనూ లయ స్వతస్సిద్ధంగా అంతర్నిహితంగా ఉంటుంది. అందానికి నిర్వచనాలు మారవచ్చు. వైవిధ్యం ఉండవచ్చు. కాని అనుభూతికి సహృదయమే ప్రమాణం.

# 4

సాహిత్యరాసిక్యాన్ని సముల్లాసితంచేసే ప్రయత్నాలతో తన మనుగడను సార్థకపరచుకుంటున్న 'యువభారతి' సరసకవులైన శ్రీ అనుముల కృష్ణమూర్తి గారి 'సరస్వతీ సాక్షాత్కారము' అనే కావ్యాన్ని తమ తొలి ప్రచురణగా తెలుగు రసికులకు ఉపాయనంగా సమర్పించుకున్నది. రసరహస్యం తెలిసిన వ్యుత్పన్నుడైన కవి ఛందోబద్ధంగా కూడా ఎంత అందంగా, ఎంత ప్రభావోపేతంగా గుండెలకు తాకే విధంగా చెప్పగలడో ఈ కావ్యం నిరూపిస్తున్నది. 'యువభారతి'కి కవితా విషయంలో బాహిరదృష్టిలేదు. అందుకే ఈ కావ్యప్రచురణ.

'మళ్ళీవెలుగు' శీలా వీర్రాజుగారి కమనీయ కవితాఖండం. వీర్రాజుగారు మననశీలురు. లోచూపున్న కవులు. చిత్రలేఖన కళాపారీణులు. చేవఉన్న కథకులు. యదార్థ జీవిత ప్రతిబింబమైన నవలాప్రక్రియా ప్రయోగంలో నిష్ణాతులు. 'యువభారతి' సభ్యులకు ప్రీతిపాత్రులు, స్నేహితులు. యువభారతి కార్యక్రమాలు అంత కళాత్మకంగా, అంత రమణీయంగా నిర్వహింపబడడంలో శ్రీ రాజుగారి అదృశ్యహస్తం కుంచెను, కలాన్ని ఆడించింది. శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి వలెనే శ్రీ రాజుగారు 'యువభారతి'కి హితులు సన్నిహితులు. 'యువభారతీయు'లలో ఒకరై కష్టసుఖాలలో పాలుపంచుకున్న పరమ ఆప్తులు. కనుకనే 'యువభారతి' వచనకవిత్వంలో క్రొత్తప్రయోగమైన ఈ 'మళ్ళీవెలుగు'ను ప్రచురిస్తున్నది. హర్షోత్ఫుల్లమైన హృదయంతో ఈ కావ్యాన్ని తెలుగుప్రజానీకానికి అందించగలుగుతున్నది. శ్రీ అనుముల కృష్ణమూర్తిగారిది పద్యకావ్యం. శ్రీ వీర్రాజుగారిది గద్యకావ్యం. కాని రసికులకు రెండూ ఒక్కటే. మాకూ అంతే.

ఈ కావ్యంలో ఒకనాటి జీవితం పలువేళల్లో అవతారాలు దాల్చిన ఉదంతం కథావస్తువు. ఈనాటి నగరజీవితాన్ని కళాత్మకంగా సహృదయవేద్యంగా చిత్రించడం దీని లక్ష్యం. నగరంలోనే బాహిరజీవితాన్ని అంతర్ముఖంగా కవి దర్శించి మలచిన కావ్యమిది. ఇదొక స్పందనం. ఒక వ్యాఖ్యానం. ఒక అనుభూతి. ఒక చిత్రశాల. నగరంలోని పొగలను, సెగలను, నవ్వులను, ఏడ్పులను, వికటాట్టహాసాలను, నిద్రాముద్రిత వివేకాన్ని, కన్నీటిని-పన్నీటిని, మనిషిని-మనీషిని చూపిస్తున్న కావ్యమిది.

సహజచిత్రకారులు, కవులు, కథకులు అయిన శ్రీ శీలా వీర్రాజుగారి బహుముఖ ప్రజ్ఞకు ఈ కావ్యం దర్పణం వంటిది. "యువభారతి" తన ఆదరాభి

మానాలను చూరగొన్న శ్రీ రాజుగారి ఈ కావ్యాన్ని ప్రచురిస్తున్నందుకు గర్విస్తున్నది. ఆనందిస్తున్నది.

తన కమనీయ కావ్యాన్ని ప్రచురించ గలిగే అవకాశాన్ని ఆప్యాయంగా అందించిన శ్రీ శీలా వీర్రాజు గారికి "యువభారతి" కృతజ్ఞతలు తెలుపుకొంటున్నది. ఆయన కళాహృదయానికి, స్నేహభావానికి నివాళులర్పిస్తున్నది. తెలుగుపాఠకలోకం మా ఈ ప్రయత్నానికి సాధువాదం పలుకుతుందనే ప్రత్యయంతో ఈ ఉగాదినాడు వెలువరిస్తున్నది.

యువభారతికి యిది పదోవసంతం. ఈ ఉగాదినాడు శ్రీ శీలా వీర్రాజుగారి 'మళ్ళీవెలుగు', యువభారతి సాహితీమిత్రుల కవితా సంకలనం 'ఉషస్సు', యువభారతీయుల కవితా సంకలనం 'స్వరాలు' పుస్తకాల్ని రసికలోకానికి అందిస్తూ యువభారతి సాహిత్యోత్సవాలను జరుపుకుంటున్నది.

ఈ కావ్యాన్ని ముచ్చటగా అచ్చుపోసిన నాగార్జున ప్రింటర్స్ అధినేతలు శ్రీ నారాయణగారికి కృతజ్ఞతలు.

జీవితంపట్ల, జీవితంలోని కమ్మదనంపట్ల ఆశలను పెంచి, ఉత్సాహాన్ని ప్రసాదించి బ్రతుకు బరువులను ఎదుర్కొనే వివేకాన్ని, సాహిత్యం ప్రసాదించ గలుగుతుంది. మరి ఈ సాహిత్యం విస్తృతంగా విరబూచగలిగినప్పుడే దాని ప్రయోజనం సంపన్నమవుతుంది. సాహితీ ప్రసరణానికి ఇతోధికమైన సదవకాశాలను కల్పించాలనే యువభారతి రకరకాల కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తున్నది. పుస్తకప్రచురణం ఈ కార్యక్రమాల మణిహారంలో ఒక పూసమాత్రమే. సహజంగా సరసులైన తెలుగుప్రజలు మా ఈ సాత్త్వికకృషికి చేయూతనిస్తారని ఆకాంక్షిస్తున్నాము. కవిత్వం మనసులను కలపగలుగుతుందని మా నమ్మకం. ఈ నమ్మకమే మా లక్ష్యం - మా ధ్యేయం.

—ఇరివెంటి కృష్ణమూర్తి

4-4-1973 అధ్యక్షుడు, యువభారతి

# మా గురించి




ప్రతిభా కళిక వికసనం పొందడానికి తన పరిమళాలను వెదజల్లి దీప్తం వ్యాప్తం కావడానికి అనువైన వాతావరణం ఏర్పడినప్పుడే సమాజం సజీవంగానూ, నిత్యనూతనంగానూ, నిర్మాణాత్మకంగానూ, అభ్యుదయ పథంలో సాగిపోగలుగుతుంది.

యువతరంలో నిర్మాణైక దృక్పథాన్ని, అధ్యయన శీలతను, పరస్పరావగాహనను పెంపొందించగలిగితేనే ప్రజాస్వామ్య వ్యవస్థకు సుస్థిరమైన పునాది ఏర్పడుతుంది. ప్రజలను సమీకరించడానికి రాజకీయోద్యమాలు తాత్కాలికంగా కారణమౌతాయేమోగాని, నిరంతరం సభ్యతా మర్యాదలూ, ప్రేమానురాగాలూ, సాహిత్యోద్యమం వల్లనే రూపొందుతాయనడం యథార్థం. పుస్తకాలను చదివించి పాఠకులకూ రచయితలకూ మధ్య సద్భావసేతువును నిర్మించి పఠనాసక్తిని పెంపొందిస్తే సాహిత్యప్రయోజనం సమకూరుతుందని యువభారతి విశ్వాసం. గత పదేండ్లుగా యువభారతి వివిధ ఉపన్యాస, పుస్తక ప్రచురణ, గోష్ఠి, సమీక్షా వ్యాస సంకలన ప్రచురణలే కాకుండా ప్రతిమాసం రెండుమార్లు సమావేశమై సంస్థ సభ్యుల్లో నిద్రాణంగా ఉన్న సృజనాత్మక శక్తులను ప్రేరేపించి, ఉద్దీప్తం చేయడానికి రకరకాల సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

ఆలోచనా స్వేచ్ఛను దేశపురోగతికి తోడ్పడే విధంగానూ, సృజనాత్మక రచన ప్రతిభాసమున్మేషణానికి దోహదంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం దేశనిర్మాణంతో పెనవేసుకొనిపోయే విధంగానూ, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలనే దృఢసంకల్పంతో యువభారతి వివిధ కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది.

ఇటీవలనే యువభారతి ప్రారంభించిన 'సాహితీ మిత్ర' పథకం యావద్భారత దేశంలోని తెలుగు సాహితీ ప్రియుల సహకార సద్భావాల ఊతగా తీసుకుని సాహిత్య కార్యక్రమాలను నిర్విఘ్నంగా నిర్వహించడానికి రూపొందించబడ్డది. దేశంలో తెలుగు రసికుడు ఎక్కడున్నా సరే, అతడు యువభారతికి తోడ్పడగలుగుతున్నాననే తృప్తి పొందేట్టుగా దీనికి రూపకల్పన చేయబడింది.

శీలా
వీర్రాజు

ఇంతవరకూ 1,500 మంది సాహితీ మిత్రులుగా చేరి యువభారతి కార్యకలాపాల పట్ల తమ తృప్తిని, విశ్వాసాన్ని ప్రకటించారు.

ప్రాచీన అర్వాచీన సాహితీ మర్యాదలతో పఠితృలోకానికి పరిచయం చేయడానికి సమకాలీన సమస్యల పరిజ్ఞానం కలిగించడానికి, యువభారతి ఇంతవరకు 'కావ్యలహరి', 'చైతన్య లహరి' 'రచన' 'మహతి' గ్రంథాలను ప్రచురించి సాహితీ ప్రియుల మన్ననలను, విజ్ఞుల ఆశీస్సులను పొందగలిగిందని సవినయంగా మనవి చేస్తున్నాం.

సాహితీ మిత్రులను ఒక ప్రాంగణంలోకి తీసుకురావడానికి, సాహితీ మిత్రుల కవితా సంకలనం 'ఉషస్సు' ఈ ఉగాదినాడు వెలువరిస్తున్నాం. 'యువభారతి' కవితా సంకలనాలు 'వీచికలు' 'అక్షరాలు' ఇంతవరకు వెలువడ్డాయి. ఈ ఉగాదినాడు వెలువడేది 'స్వరాలు'. మాకు ఆప్తులూ, కవితాప్రతిభా సంపద్యుక్తులూ అయిన శ్రీ శీలా వీర్రాజుగారి వచన కవితా ప్రయోగం 'మళ్ళీ వెలుగు'ను ఈ ఉగాది నాడే వెలువరిస్తున్నాము.

తెలుగు జాతిని తమ సాహిత్యం ద్వారా, మహోదాత్త జీవితం ద్వారా ఉద్దీప్తం చేసిన మహామనీషులు నన్నయ, పోతన, పింగళి సూరన్న, కందుకూరి వీరేశలింగం, తిరుపతి వేంకటకవులపై విజ్ఞులచేత ఉపన్యాసాలిప్పించి వాటికి 'వికాసలహరి' అనే పుస్తక రూపం కల్పించి సాహితీ మిత్రులకు ఉచితంగానూ, ఇతర సరసులకు ప్రచురణ పూర్వ విరాళానికి అందించడానికి ప్రణాళికను సిద్ధం చేశాము.

వివిధ రంగాలలో యువకులు నిర్వహించిన, నిర్వహించవలసిన పాత్రను గూర్చి ఒక గోష్ఠి కార్యక్రమాన్ని నిర్వహించడానికికూడా పథకం సిద్ధమైంది.

ఒక క్రమబద్ధమైన పద్ధతిలో విశాల దృక్పథంతో, నిర్మాణైక బుద్ధితో యువభారతి ముందుకు సాగుతోంది. సాహితీ ప్రియుల, సాహితీ మిత్రుల ఆదరాభిమానాలతో, అండదండలతో సమాజంలో రాసిక్యాన్నీ, సహనభావాన్నీ, సౌందర్యపిపాసనూ, దేశభక్తినీ ఉద్బుద్ధం చేయడానికి ప్రయత్నం చేస్తుంది.

చైతన్యపూరితమైన ఆశయ సాధనా సంరంభాన్ని జడమైన అచ్చుసిరా ద్వారా అందించగలగడం కష్టం. సహృదయులు దీనివెనుకనున్న చైతన్య స్రవంతిని పోల్చుకోగలరనీ, వారి సహాయసహకారాల నందించగలరనీ

విశ్వాసంతో

ఇరివెంటి కృష్ణమూర్తి



# కవి పరిచయం

స్వస్థలం రాజమండ్రి, ప్రస్తుతం హైదరాబాదు. రాజమండ్రి కాలేజీలో 1961 లో బి.ఏ. పట్టా పుచ్చుకోడానికి పూర్వమే కలంపట్టి కథలూ నవలలూ రాసి, హైదరాబాదులో కథకీ, నవలకీ మధ్య హంసపాదు పెట్టి కవిత్వాన్ని చేపట్టారు. మొదటి సారిగా వచన కవితలో కథలురాసి రెండుసంపుటాలు ప్రచురించారు. రాష్ట్రప్రభుత్వ సాహిత్య అకాడమీనుంచి 1969లో 'మైనా' కు ఉత్తమ నవల బహుమతి పొందారు. వృత్తిరీత్యా అనువాదకులు. ప్రవృత్తిరీత్యా చిత్రకారులు. ఇంతవరకు కొడిగట్టిన సూర్యుడు, హృదయం దొరికింది అనే వచన కవితా కథా సంపుటాలు; మైనా, కరుణించని దేవత, కాంతి పూలు, వెలుగురేఖలు అనే నవలలు; మనసులోని కుంచె, పగా మైనస్ ద్వేషం, వాళ్ళ మధ్యవంతెన, రంగుటద్దాలు, వీరాజు కథలు, హ్లాదిని, మబ్బు తెరలు, సమాధి, ఛాయకింద నీర్లు అనే కథా సంపుటాలు అచ్చయ్యాయి.

గంగిరెడ్డి లక్ష్మీనారాయణ

మళ్ళీ నాచేత
కవిత్వం పలికించిన
నా అర్ధాంగి
సుభద్రకి
అంకితం







# సాహితీమిత్రులు ❋ యువభారతి

స్పందనం జీవలక్షణం !

స్పందనం సహృదయలక్షణం !

మాకృషిలో పాలుపంచుకునేందుకై సహృదయులైన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం 'సాహితీమిత్ర'. జాతిపురోగమనానికి సాహిత్యవికాసం, దాని ప్రభావం అవసరమని భావిస్తూ ఉత్తమ సాహిత్య ప్రచురణానికి యథాశక్తి ప్రయత్నిస్తున్నాము. 'సాహితీమిత్రు'లుగా చేరడం అంటే మీ సహాయ సహకారాలను మా సాహిత్యకృషికి అందించటానికి ఒప్పుకుంటున్నారన్నమాట ! యువభారతి సాహితీ మిత్రులుగా చేరడంవల్ల సమకూరే సదుపాయాలు :

* ప్రతి సంవత్సరం అయిదు రూపాయలు చెల్లించడంతో యువభారతి సాహితీ మిత్రులుగా పరిగణింప బడతారు. సాహితీమిత్ర సభ్యత్వ చిహ్నం అందుతుంది.
* తక్షణమే ఒక ఉచితపుస్తకం - 1973వ సంవత్సరంలో రు. 3-00ల ప్రచురణ పూర్వవిరాళంపై ప్రచురింపబడే 'వికాసలహరి'ని మీకు ఉచితంగా-నేరుగా అందించడంగానీ, పోస్టుద్వారా అందించడంగానీ జరుగుతుంది.
* 1973లో యువభారతి నిర్వహించే కార్యక్రమాల వివరాలు, ఆహ్వానాలు అందుతాయి.
* 1973లో మీరు యువభారతి ప్రచురణలను 25% మినహాయింపుతో - కొన్ని సమయాలలో అంతకన్నా ఎక్కువ మినహాయింపుతో మీరు సొంతం చేసుకొనవచ్చును.
* అన్నింటికన్న మిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి, మీకా సంతృప్తి కలిగించేలా, యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.

## ఈ వెలుగు దారిలో....

# వేకువ తొలి వెలుగులో.....

ఈ నాడు వచన కవిత రాస్తున్నవారి సంఖ్య ఎన్నోరెట్లు పెరిగినా దీని వికాసం మాత్రం మందకొడిగానే వుంది. రాసే వాళ్ళు పెరిగారు. చదివేవాళ్ళు పెరిగారు. అయినా యీ పెరుగుదల వచన కవిత బహుముఖ వికాసానికి అంతగా తోడ్పడలేదు. దీనికి ప్రధానమైన కారణం- సుమారు పదిహేనేళ్ళ క్రితం వచన కవితలో వచ్చినన్ని ప్రయోగాలు యిప్పుడు రాకపోవడమే. వచన కవిత నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తున్న తొలిదశలోనే యీ ప్రక్రియలో ఎన్నో ప్రయోగాలు వచ్చాయి. తెలంగాణా, వజ్రాయుధంవంటి కథాత్మక కావ్యాలు, ఆశవంటి నాటకాలు, ఆచార్లుగారి అమ్మాయి, సినీవాలి వంటి నాటికలు వెలువడ్డాయి. సినీవాలి పుస్తకంలోనే శ్రీశ్రీ, ఆరుద్రల మధ్యా, ఆరుద్ర, వరదల మధ్యా సంభాషణ పరంగా సాగిన మిత్ర సంవాదం వుంది. శ్రీశ్రీ భిక్షు వర్షీయసి, అజంతా చెట్లు కూలుతున్న దృశ్యం వచన కవిత స్కెచ్‌లుగా పేర్కొవచ్చు. కుందుర్తి, ఆరుద్రలు వచన కవితలో విరివిగా ప్రయోగాలు చేశారు. ఈ ప్రయోగాలవల్ల యీ నూతన కవితా స్వరూపాన్ని అనేక కోణాల్లోంచి చూపించడానికి వీలుకలిగింది.

ప్రయోగాలవల్ల సాహిత్యం బహుముఖాలుగా వికసిస్తుంది. ఏ సాహిత్యమైనా అభివృద్ధి చెందాలంటే అందులో విరివిగా ప్రయోగాలు జరగాలి. కొత్త కొత్త ధోరణులు కార్యరంగాన్ని విస్తృత పరిచి కవిగాని, లేదా రచయితగాని తన ప్రతిభను మరింతగా ఆవిష్కరించడానికి వీలు కల్పిస్తాయి. ప్రయోగాలవల్ల ఇంకొంత మంది పాఠకులు ఏర్పడతారు. నిత్యనూతనాన్ని అన్వేషించే కొత్త తరాల్ని ఆకట్టుకొనే వీలుంటుంది.

ప్రయోగాలన్నీ సత్ఫలితాలనే యివ్వలేక పోవచ్చు. ఈ నాడు శాస్త్రీయ విజ్ఞానం యింతగా అభివృద్ధి చెందడానికి ఆ రంగంలో నిరంతరంగా జరుగుతోన్న ప్రయోగాలూ, పరిశోధనలే ప్రధానకారణం. సాహిత్య రంగానికీ యీ సత్యం వర్తిస్తుంది. ఎందరో కవులు ఎన్నోప్రయోగాలు చేయగా ఎప్పుడో, ఎవరివల్లో అకస్మాత్తుగా కవితాస్రవంతి మరోమలుపు తిరుగుతుంది. కవిత్వంలో

ఒక కొత్త శకం ఆరంభమౌతుంది. కొందరు కవుల ప్రయోగాలు కొద్దిపాటి మలుపునే తిప్పుతాయి. మరికొందరు దానిగమనాన్నే పూర్తిగా మారుస్తారు. శ్రీశ్రీ తర్వాత అంత ఎక్కువగా కవిత్వ గమనాన్ని మరెవ్వరూ మార్చలేకపోయారు. అయితే ఏ కవో మధ్యాహ్న సూర్యుడిలా ప్రకాశిస్తూ ఎప్పుడో రాకపోడు. అనంత మైన కాలంవలె అంతంలేని యీ కవితా స్రవంతిలో ఎందరో శ్రీశ్రీలు ఉదయించకపోరు, కొత్తకొత్త పుంతలు తొక్కించక పోరు. అయితే అది పదిమంది జీవితకాలాల్లో కాకుండా ఒకజీవిత కాలంలోనే జరిగితే కవిత్వం త్వర త్వరగా అభివృద్ధి చెందుతుంది.

ఏ సాహిత్యమైనా, లేదా సాహిత్యంలోని ఏ శాఖ అయినా. శాఖలోని ఏ ప్రక్రియ అయినా అభివృద్ధి చెందాలంటే ఆ అభివృద్ధి రెండుమార్గాల్లో జరగాలి. ఒకటి— ప్రగతి పరంగానూ, రెండు— ప్రయోగాత్మకంగానూ జరగాలి. ఇప్పటి వచన కవిత ఎక్కువగా ఏక ముఖంగానే అభివృద్ధి చెందుతోంది. ఈ అభివృద్ధి వస్తువుకు సంబంధించినది. కవితా వస్తువులో యీ నాడు ఎంతో మార్పు వచ్చింది. దేశకాల పరిస్థితులకు అనుగుణంగా యీనాడు కవిత్వం ఆవిష్కృతం అవుతోంది. సమకాలీన సామాజిక చైతన్యం ఈ ఆధునిక కవిత్వంలో కనిపిస్తున్నంతగా మరి ఏ యితర సాహిత్య శాఖలోనూ కనిపించడంలేదు. ఈదృష్ట్యా కవిత్వం చాలా ముందుకు పోయిందనే చెప్పాలి. అయితే యిదొక్కటే చాలదు దీని వికాసానికి. వస్తువుతోపాటు శిల్పంలోనూ కొత్త పోకడలు పోవాలి.

కవిత్వం వైయక్తికం అనే భావకవుల ఆలోచనా ప్రభావం నుండి యీ నాటి ఆధునిక కవులు యిప్పటికీ బైటపడలేకపోయారని చెప్పొచ్చు. అనుభూతి ప్రధానమైనది కవిత. అయితే ఆ అనుభూతి వైయక్తికమే అయినా దాని ప్రయోజనం మాత్రం సామాజికం కావాలనే సిద్ధాంతంతో ఎవరికీ విభేదం వుండడానికి వీల్లేదు యీనాడు. ఇప్పటికవులు చాలామంది అనుభూతి పేరుతో కవితా రంగాన్ని పరిమితం చేసుకుంటున్నారనిపిస్తుంది. ఎంతో సమర్థవంతంగా కవిత్వాన్ని రాయగలిగిన అనేకమంది ఆధునిక కవులుసైతం కవిత్వానికి సరిహద్దులు గీసి, ఆ లోపలే తమ ప్రతిభని ప్రకటించుకుంటున్నారుగాని బైటికివచ్చి విస్తృతమైన కార్యక్షేత్రంలో విజృంభించడానికి యిష్టపడడం లేదు. అందువల్ల

సమర్థులైన ఆయా కవుల ప్రతిభ బైటపడుతున్నప్పటికీ కవిత్వం కొత్తపుంతలు తొక్కలేకపోతోంది. తిలక్‌వంటి చేయితిరిగిన కవి, వచన కవితకు ఒక నిండుదనాన్ని కల్పించినవాడు సైతం కవిత్వం స్వేచ్ఛగా ఎదగడానికి యిష్టపడలేదు. వచన కవిత వస్తువును ఆశ్రయించి కథాకథన పద్ధతిగా ఎదగాలని కుందుర్తి అభిలషించగా తిలక్ అందుకు ఒప్పుకోలేదు. వచన కవితలో కథ, నవల మొదలైన కావ్య స్వరూపాల్ని ఆయన తిరస్కరించాడు.

అయితే కుందుర్తిది కూడా పాక్షికదృష్టే. వచన కవితలో కథా కావ్యాలు రావాలనే ఆయన కోరుతున్నాడుగాని అంతకు మించి నూతన ప్రయోగాలను ఆయన ఆశించడంలేదు.

వచన కవితను ఏ హద్దులు, సరిహద్దుల మధ్యా బంధించకుండా అన్ని వైపులా దాన్ని ఎదగనివ్వడానికి దోహదంచేయాలి. ఒక కథ, ఒక నవలేకాదు, అన్ని ప్రక్రియల్లోకీ అది చొచ్చుకుపోవాలి. ఇటువైపు తొంగిచూడగూడదని అడ్డుగోడలు కట్టడంవల్ల దాని సర్వతోముఖ వికాసానికి ఆటంకం ఏర్పడుతుంది.

ఈ నాడు వచనకవిత రాస్తున్న కవులలో అత్యధికసంఖ్యాకులు ప్రగతి వాదులు. వీరు తమ ఆలోచనా ధోరణులను బట్టి ఒకరి మధ్య ఒకరికిగల తేడాను సూచించడానికి ప్రత్యేకమైన వర్గాలుగా విడిపోయి ఆ యా పేర్లతో పిలువబడుతున్నప్పటికీ స్థూలంగా వీరంతా ఒకే కోవకు చెందినవారు. వీరంతా వచన కవితను చేపట్టినవారు. వీరంతా ప్రగతి వాదులు. మార్గాలు వేరయినా లక్ష్యం ఒక్కటే. అయితే యీ ఆధునిక కవులు వస్తువుమీద చూపిస్తున్నంత ఆసక్తిని శిల్పం మీద చూపడంలేదు. ప్రగతి వాదంతో పాటు ప్రయోగశీలతకూడా వీరు చూపితే ఒక వైపు వారు ఆశించే సామాజిక ప్రయోజనమూ, మరోవైపు సాహిత్య ప్రయోజనమూ రెండూ నెరవేరుతాయి. ఈ విషయాన్ని ఆధునిక కవులు బాగా ఆలోచించటం అవసరం.

వచన కవితలో యిప్పుడు చాలామంది సిద్ధహస్తులు తయారయ్యారు. ఆధునిక వచన కవిత్వానికి మూల స్తంభాలుగా పేర్కొదగ్గ పెద్దపెద్ద కవులను మించి గొప్పగా వచన కవిత రాయగల యువకవులు ఎక్కువగానే యీ నాడు వున్నారు. అయితే వీరిలో

ప్రయోగాలమీద ఆసక్తిగలవారిని వేళ్ళమీద లెక్కించొచ్చు. రంధి సోమరాజు, వరవరరావు, సి. విజయలక్ష్మి, సి. వి. కృష్ణారావుల వంటివారు ఏ కొద్దిమందో తప్ప మిగిలిన వారంతా ప్రయోగానికి దూరంగానే వుండిపోయారు.

ఈ ప్రయోగాలవల్ల వచనకవిత నిస్సందేహంగా ముందుకు పోయిందని చెప్పొచ్చు. అయితే వెళ్ళాల్సినంత ముందుకుమాత్రం వెళ్ళలేదు. ఇంకా విరివిగా ప్రయోగాలు రావాలి. మరింత ఎక్కువగా ప్రయోగవాదకవులు తయారవ్వాలి.

నాకు ప్రయోగాలంటే యిష్టం. మళ్ళీవెలుగు యీ విధమైన రచన. ఒక వర్ణనాత్మక కావ్యం. ఉషస్సునుంచి అర్ధరాత్రివరకు నగరజీవితాన్ని అద్దంపట్టి చూపించే ప్రయత్నంచేశాను. కేవలం నగరజీవిత చిత్రణే నా ఉద్దేశంకాదు. రెండు భిన్నభిన్న దృశ్యాల్ని యథాతథంగా చూపి, ఆ రెంటిమధ్యగల వ్యత్యాసాన్ని అర్థవంతంగా పాఠకుడికి తెలియజేసే ప్రయత్నం యిందులో వుంది. సమాజంలోని హెచ్చుతగ్గుల్ని బైటికితీసి చూపించి పాఠకుడిని ఆలోచింపజేయడానికీ, కార్యోన్ముఖుడ్ని చేయడానికీ ప్రయత్నించాను.

ముఖ్యంగా యిది ధ్వని ప్రధానమైన కావ్యం. ఒకొక్క సమయాన్నీ ఒకొక్క సామాజికస్థితికి చిహ్నంగా అన్వయించి సాగించిన రచన యిది. ఉషస్సు ఆశకు, ఉదయం చైతన్యానికి, మధ్యాహ్నం అధికారానికి, సాయంత్రం ఆకర్షణకు, సంధ్య పతనానికి, రాత్రి పాపానికి, అర్ధరాత్రి జడత్వానికి సంకేతాలుగా స్వీకరించి, ఆ యా సమయాలలో నగరజీవితాన్ని విపులంగా వివరించి; ఆఖర్లో ఈ జడత్వం, యీ చీకటి ఎప్పటికీ ఇలా వుండిపోవని, మళ్ళీ వెలుగు వస్తుందని ఆశను రేకెత్తిస్తూ, ఒకవైపు ప్రయోగవాదానికి, మరోవైపు ప్రగతివాదానికి తార్కాణంగా ఈ ఆధునిక ధ్వనికావ్యాన్ని మీముందు వుంచుతున్నాను.

ఈ ప్రయోగాత్మక కావ్యాన్ని ప్రచురించడానికి తమంత తాముగా ముందుకొచ్చిన 'యువభారతి' సాహసానికి అభినందిస్తూ, వారి అభిమానానికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

# ఉషస్సు

తూర్పు ఆకాశం అడుగున
దోరముగ్గిన చీకటిమరుగున
పురిటినొప్పులు పడుతోన్న
రాత్రివిడిచిన నిట్టూర్పుల్లా
కావుకావుమనే కాకుల అరుపుల్లో
రంగురంగుల చక్కని కల
చటుక్కున విరిగి
మనసు తెలివిలోకి దిగిన ఆ వేళ
నల్లని చీకటిచీరకు
పై అంచులాంటి మబ్బురంగు తొలిఝాము వేళ

అది
రెండంతస్తుల మిద్దెకీ రెల్లుగడ్డి గుడిసెకీ
సరిహద్దు బాటలా
అటు వొళ్ళెరగని నిద్రకీ
ఇటు వొళ్ళెరిగే పనికీ మధ్య
రాత్రినీ ఉదయాన్నీ వేరుచేసే
సన్నని కాల్దారి—
కాలం

అప్పుడు
వెల్లేసిన పొగచూరిన వంటింటి గోడలా
ఎండా వానల్లో తడిసి రంగెలిసిన ఎగరేసిన జెండాలా
వాడిన కలువలా ఆరిన నిప్పులా
వెలతెల పోతోంది చీకటి

కడుపున నలుసుపడ్డ యిల్లాలి వొంటిమీద
మెలమెల్లగా వన్నె కెక్కిన రంగులా
పక్వానికొస్తోన్న వెలగపండు పెంకుమీద
చరచరా పాకివచ్చిన బూడిద తెలుపులా
ఆకాశం తూర్పున పలచబడి
అడుగునుంచి కొద్దికొద్దిగా తెల్లపడి
కలకల్లాడుతోంది కాస్తంత చిరువెలుగు

అంతపెద్ద నల్లని కేన్వాసుమీద
ఓ చోట
కుంచెతో జానెడు తెలుపు పులిమినట్టున్న
ఆ గుప్పెడు వెలుగు
సువిశాలమైన ఎడారిలో చిన్న ఒయాసిస్సు
బ్రతుకంతా బాధలు పరచుకున్న కష్టజీవి
భవిష్యత్తుమీద పదిలంగా దాచుకున్న
వారసత్వపు దీపం ఆ ఉషస్సు

దీపం జ్యోతిలా లేదు గీతలాగే కనిపించడంలేదు
మంచుతెర వెనక వెలుగుపొడిలాగ వుంది
కాంతిని పల్చగా పరిచినట్టుంది

రాత్రంతా నగరాన్ని పాలించిన చీకటి
తనచుట్టూ కట్టుకున్న కోటగోడ—
మంచు

సామ్రాజ్యం నాశనమైనా
గోడమాత్రం యింకా నిలిచేవుంది
దానిచుట్టూ తవ్విన కందకం—
చలి
అదికూడా నీళ్ళతో నిండేవుంది

తూర్పున
కావలించుకున్నట్టున్న ఆ మేడల అవతల
పొలిమేరల గట్టున
చెట్లకొమ్మల చాటున
పెద్దపెద్ద బండరాళ్ళ వెనక
రహస్యంగా మొదలైన ప్రజావిప్లవం
మెలమెల్లగా పాకి అన్నివైపులా ఆవరిస్తున్నట్టు
ఆకాశమంతా అల్లుకుంటోంది వెలుగు

విప్లవానికి ముందు
అక్కడ రహస్యంగా జరుగుతోన్న సంరంభాన్ని
ఒక మహత్తర పరిణామాన్ని
చూడలేని గుడ్డిది - నగరం
విప్లవంవచ్చి రక్తం ఏరులైపారి
అందులోంచి తడిసి ఏ సూర్యుడోవచ్చి
వెచ్చని కిరణాల బాకాల్తో
వెలుగు వార్తల్నిచెప్తూ
ఈ చీకటి సామ్రాజ్యం అంతరించి పోయిందని
కొత్తరోజు వెలిసిందని
దిక్కులు పిక్కటిల్లేట్టు తెలిపేదాకా
పట్టించుకోని చైతన్యంలేని
మన్నుతిన్న జెర్రిగొడ్డు—
నగరం

ఇక్కడ
ఆకాశవాణి వార్తలు వచ్చేవరకూ ఉదయంకాదు
ఎలాంటి పరిణామాలు వచ్చినా కళ్ళువిప్పి చూడదు
అంతవరకూ ప్రతీదీ కలకిందే జమ
వెలుగున్నా అది చీకటనే భ్రమ

రాత్రి రెండోఝాముదాక మేలుకున్న నగరం
ఆదమరిచి నిద్రపోతోంది
ఆకాశంనించి చూస్తే అది
అచ్చం ఆకుల్లేని మోడైన చెట్టులాగే వుంది
కొమ్మలూ రెమ్మలూ—
దానికి సందులు గొందులు
విశాలమైన కాండం-రాజవీధి
వేర్లు—
పొలిమేరల్లో పల్లెల్లో కలిసిపోయిన దార్లు
మోడైపోయిన నగరానికి వసంతం-వెలుగు
వెల్తురొచ్చేకొద్దీ చెట్టు చిగురిస్తుంది
ఎండొచ్చేకొద్దీ పూలు పూస్తుంది
మధ్యాహ్నం కాయలు కాసి
రాత్రికి పళ్ళు రాలుస్తుంది
అర్ధరాత్రి దాటితే
మళ్ళీ ఆకులు రాలుస్తుంది
మోడై నిలుస్తుంది

చెట్లమీది పక్షులు
అప్పుడే ఆలస్యం అయిపోయినట్టు
మంచుకి తడిసిన రెక్కల్ని టపటపా కొట్టుకొని
రెట్టల్తోపాటు రెక్కల్లో బద్ధకాల్ని రాల్చుకుని
చెట్టంతా ఎగిరి తమవాళ్ళను పలకరించి
పొవుపిడికెడు పొట్టలోకి

అరతులం గింజల్ని ఏరుకుందామని
కడుపుమంట చల్లార్చుకుందామని
పదిమైళ్ళ దూరానికి
ఊరిబయట పొలిమేరల్లోకి
బారులు బారులుగా
ఆకాశంలో పక్షులు

కష్టపడితేగాని డొక్కాడని సన్నకారు జీవాలవి
పిచ్చుకలూ గోరింకలూ నిజానికి
శ్రామికవర్గానికి ప్రతినిధులేమరి
వాటికి
రోజల్లా కష్టపడితేగాని డొక్కాడదు
ఊరొదిలి వెళితేగాని తిండిదొరకదు
తమకడుపు నింపుకోడానికి
పరాయివాళ్ళమీద ఆధారపడే
పరాన్నభుక్కులు కావు
ఎంగిలిమెతుకులకు ఆశపడే
దేబిరిముఖాలు అసలేకావు
తమరెక్కల బలంమీద ఎగిరి
తమ కాళ్ళ సత్తువమీద నిలిచి
తమతిండి తామే సంపాదించుకొనే కష్టజీవులు

కష్టజీవులు సమిష్టిజీవులై
ఆకాశంలో బారులుతీర్చి ఎగిరిపోతున్నా
అడుగున భూమ్మీద మసీదు గూళ్ళలో
మహారాణుల్లా యింకా నిద్రపోతూనే వున్నాయి
ధనికవర్గానికి ప్రతినిధులు పావురాళ్లు

పుట్టుకతోనే ఐశ్వర్యానికి వారసులుగా
ఏ భవంతుల కలుగుల్లోనో

ఏ మసీదుల గూళ్ళల్లోనో
ఎండావానా భయంలేనిచోట పుట్టి
సమయానికి అన్నీ అమర్చిపెట్టినట్టు
ఎవరోవచ్చి యిన్నినూకల్ని పడేస్తే ఏరుకుని
మెచ్చగా
కడుపులో చల్ల కదలనంత హాయిగా
సోమరిగా
కాలంవెళ్ళబుచ్చే పెద్దింటి ఆడపడుచుల్లాటి పక్షులు !

ఆకాశంలో చీకటిని
పడమటి పొలిమేరలదాకా తరిమేసినా
భూమ్మీద యింకా
తన స్థావరాల్ని వదిలిపోలేదు చీకటి
అక్కడక్కడ చెట్ల గుబురుల్లోనూ
ఎత్తయిన మేడల పిల్ బాక్స్‌ల్లోనూ
ఇరుకు సందుల కందకాల్లోనూ
పొంచి చూస్తూనేవుంది
దొంగలా చీకటి

తెల్లని ఆకాశంముందు నల్లని మేడలు
నగరంనిండా సిల్హౌవుట్ చిత్రాలు
వాడంతా బ్లాకవుట్ పాటిస్తున్నట్టు
తలుపులు బిగించుకున్న చీకటి మేడలు

మేడల్లో మారాజులు
కిటికీ తలుపులు బిగించుకుని
చలికి బిగుసుకుపోకుండా
పరుపుల్లో చుట్టచుట్టుకొని
తొలగిపోయిన వెచ్చని సంకెళ్ళను
ఒంటికి తగిలించుకుని

నిశ్చింతగా నిద్రపోతున్నారు
తెలివొచ్చినవారు టైం చూసుకుని
అప్పుడే తెల్లారిపోవడంచూసి వెలుగుమీద విసుక్కుని
మనిషి చేతిలో పనైతే
డబ్బిచ్చి ఓట్లు కొనైనా సరే
రాత్రికి సగంరోజు చాలదని
పదహారుగంటలు విధిగా వుండితీరాలని
పకడ్బందీగా చట్టంఒకటి చేయించైనా
ఈ వెలుక్కి నా తడాఖా చూపేవాణ్ణని
చేతకానితనాన్ని చికాగ్గా ఒప్పుకుని
కాస్సేపు పక్కలమీదపొర్లి నిద్రలోకి జారుతున్నారు
మేడలచుట్టూ చీకటి
ఇంకా తిష్టేసుకు కూచున్నా
పాకలమీద మాత్రం
పల్చటి పచ్చివెలుగు పరచుకొంటోంది
మంచుకి తడిసిన ఆకులమీద వెలుగు
పొడిపొడిగా అంటుకుంటోంది
నిజానికి అది వెలుగుకాదు పొగ
రాజేసిన పొయ్యిల్లో కాలని కట్టెల నిట్టూర్పుల వగ
పాకల్లోంచి పాయలు పాయలుగా
పైకి లేచిన పొగ
ఒకదానిలో ఒకటి కలిసి
పడుగు పేకలుగా అల్లుకుని
సన్నని వెలుగుచీర వాడంతా చుట్టుకుని
దుమ్ముకొట్టుకుపోయిన చింపిరి ఆకారాలకు
అందమైన ముసుగేస్తోన్న తెల్లనిపొగ !
హట్స్ యూనియన్ వాడల్లో
కొత్తరోజు అప్పుడే కాలుపెట్టింది

అక్కడి పొయ్యిల్లో కాలుతోన్న ఉప్పుచేప అందుకు సాక్షి
ఎంగిలి మెతుకులకని అప్పటికే కాచుక్కూర్చున్న కాకులసాక్షి
పాతిక యిళ్ళల్లో పాచిపనికి ఆలస్యమైపోయిందని
రొమ్ముతప్పించి లేచిపోయిన తల్లి చాటుబిడ్డ ఏడుపుసాక్షి
ఫేక్టరీకి టైమయినా వంటింకా కాలేదని
పెళ్ళాంమీద మొగుడువిప్పిన బూతుల పంచాంగం సాక్షి
రోడ్డెక్కుతున్న రిక్షా మువ్వలూ
నేలమీద కాలువలుకట్టి కదులుతోన్న చన్నీళ్ళూ
పెంటకుప్పల్ని కెలుకుతోన్న కోళ్ళూ
కాళ్ళకు అడ్డంపడుతోన్న కుక్కపిల్లలూ
అక్కడ కనిపించే ఆరాటం, హడావుడీ
అక్కడ వినిపించే చీవాట్లూ, తిట్లూ
తోకముడిచిన రాత్రికీ
తొలిపాదం మోపిన పగలుకూ సాక్షులు

ఈ వెలుగుమంటలో కండరాల్ని కరిగించకపోతే
రాత్రికి పేగులు కరకరలాడక మానవనీ
కళ్ళు గిరగిర తిరగక తప్పవనీ
కాళ్ళకు బుద్ధిచెప్తోన్న కష్టజీవులు
చలిలో బిర్రబిగుసుకుపోయిన నగరానికి
వెచ్చని ఊపిరితో కాపడంపెట్టి
స్పృహలేని వొంటిమీదకు తెలివి తెప్పించి
ఎండిపోయిన కాలవల్లోకి నీళ్ళు పారించినట్లు
చచ్చిపడున్నట్టున్న చలనంలేని నగరవీధుల్లోకి
చైతన్యాన్ని మోసుకెళ్తున్నారు

రాత్రల్లా చలిలో తడిసిన కొమ్మల్తో
కొంకర్లు తిరిగి ముడుచుకుపోయి
ఒళ్ళంతా బిగుసుకుపోయి
తలనాన్న కదపలేక

ఆరుబయట ఆకాశంకింద
ఒంటికాలిమీద తపస్సు చేస్తోన్న దిగంబర మునుల్లా
నిల్చున్నాయి నిశ్చలంగా నగరంలో చెట్లు

తూర్పునుంచి ఎఱ్ఱని కిరణం వొచ్చి
ములుగర్రలా గుచ్చి
దానితోపాటు గాలితెర వీచి
నిలువునా కుదిపి వొళ్ళొంచేదాకా
పుణ్యం పోగేసుకుందామన్న స్వార్థమేతప్ప
పరులకు సాయంచేద్దామన్న ఆలోచనేలేక
ఒంటిపిల్లి రాకాసుల్లా
తపస్సు చేసుకుంటున్నాయి
నగరంనిండా సోమరిపోతు చెట్లు

రాత్రెప్పుడో కట్టలుతెగి పూళ్ళోకి దిగి
రోడ్లనిండా మంచు ప్రవహిస్తున్నట్టు
ఇరువైపులా గట్లలా నిలిచిన యిళ్ళమీంచి
ఇంటిముందు గోడలమీంచి
గోడలపక్క గుబురుల మీంచి
పొర్లిపోతూ
పక్కసందుల్లోకి జారిపోతూ
నగరమంతటా వెల్లసి పొగమంచు
పాలల్లో పంచదార కలిసినట్టు
మజ్జిగలో ఉప్పుపొడి కరిగినట్టు
దరిద్రంలో కష్టాలూ, ఐశ్వర్యంలో విలాసాలూ
చేతకాని తనంలో చిరాకూ
ఒకదానిలో ఒకటి కలగలిసి పోయినట్టు
చూపుల్తో వడకట్ట లేనంతగా
పల్చటి పచ్చివెలుగూ సన్నటి పొగమంచూ

పగటివేళ
ఇక్కడి మనుషుల్లాగే దగ్గరగా ముడుచుకుపోయి
స్వేచ్ఛగా కదలడానికి చోటులేక
సంకుచిత మనసులా సరిహద్దుగీతలు గీసుకుని
ఇరుకై పోయిన నగరంరోడ్లు
నిర్మానుష్యమైన ఆవేళప్పుడు మాత్రం
ఎప్పుడూలేనంత విశాలం!

నిజానికి నగరంలో రోడ్లు
పదిమంది చూస్తేకాని దానంచెయ్యని
పెద్దమనిషి హృదయం లాటివి
చూడ్డానికి విశాలంగానే వుంటాయి
బయటనుంచుని చూస్తే
నాగరీకంగావున్న అమ్మాయిలా
బహుచక్కగానే కనిపిస్తాయి
తీరా రోడ్డెక్కి కొలిస్తే ఏముంది
అసలు బండారం బైటపడుతుంది
ఇటూ స్తే అటెళ్ళడానికైనా వీల్లేని
ఓ నిమిషం కదలకుండా నిలుచోడానికైనా చోటులేని
ఇరుకుదారి గుట్టుకాస్తా బట్టబయలౌతుంది

రక్తంతాగే రోడ్లకి
ఇంకా ఆకలి ఆరాటం అంటలేదు
అయిదేళ్ళలోనూ అరడజను హత్యలు చేయించి
మళ్ళీ ఎన్నికలొచ్చేసరికి ప్రజల్లోకొచ్చి
నమ్మకంగా చేతులు జోడించి
ఓట్లడిగే భూస్వామ్య రాజకీయవేత్త ముఖంలా
మరీ అమాయకంగా
కొట్లో గళ్ళా పెట్టెముందు రక్తంతాగి
ఇంట్లో పూజగదిలో మంచితీర్థం సేవించే షావుకారు

# 27

శీలా
వీరాజు

పూజలో కట్టుకున్న పట్టుపంచె మనసులా
మరీ ప్రశాంతంగా
రక్తదాహాన్ని, ఆకలి కోరికల్ని మర్చిపోయి
అహింసా మూర్తుల్లా వున్నాయి రోడ్లు

రాత్రి గడ్డకట్టిన నిశ్శబ్దాన్ని బద్దలుచేస్తూ
తలుపుల్ని తలపుల్ని బిగించుకుని
నిద్రపోతున్న వాళ్ళ మనసుల్ని సైతం గిచ్చిలేపుతూ
అడ్డే వాళ్ళు లేక
రోడ్డంతా తమదే అనుకుని
బలమైన ప్రత్యర్థి లేని పార్టీలా
స్వేచ్ఛగా కదులుతున్నాయ్
అప్పుడో ఆటో అప్పుడో స్కూటర్

వాటి చక్రాలకింద నిశ్శబ్దం
ఎండిన చితుకుల్లా చిటపటలాడుతోంది
దూరం దారపుండలా విప్పుకుంటోంది
చక్రాలు తిప్పి దారం పురిపెట్టి
జములుగా పేనిన తాడు—దూరం
అది కాలానికివేసి లాగిన పగ్గం

కాలాన్ని పారిపోనీకుండా పగ్గాల్ని బిగపట్టి
తొందరగా గమ్యాన్ని చేరుకుందామని
పరుగెట్టిస్తోన్న యంత్రమృగాలు
అప్పుడప్పుడు జంతువునో
జంతువులాటి ఏ పాదచారి మనిషినో చూసి
అవి చేసే ఛీత్కారాలు
కాస్సేపు గాలినీ గోడమీది చీమల్నీ
ఫుట్‌పాత్‌లమీద గొంగళి పురుగుల్లా
గోనెపట్టాల కోశాల్లో నిద్రపోతున్న ముష్టాళ్ళనీ

బెదిరించి గజగజలాడించి
ఈ వెధవల్ని అప్పుడప్పుడు కసిరి
అదుపులో పెడ్తేగాని మనమాట వినిచావరనే
అయ్యగారి మనస్తత్వాన్ని ప్రదర్శించి
మరీ అతిగాపోతే మొదటికే మోసమని
తిరగబడి మీద పడతారని
క్షణంకూడా ఆలస్యం చెయ్యక
ఆ క్షణమే తోకముడుస్తున్నాయ్
కళ్ళు విప్పి చూసేలోపలే
అందనంత దూరానికి పలాయనం చిత్తగిస్తున్నాయ్

రోడ్లపక్క ఫుట్‌పాత్‌లపైన
మూసిన షాపుల అరుగులమీద
అన్ని దిక్కులూ వుండి పై దిక్కులేని
బలగం అంతావుండి బలంలేని
ఓటూ చోటూ లేని
చిర్నవ్వూ చిర్నామాలేని
ముష్టాళ్ళూ కుష్టాళ్ళూ
పైన కప్పుకోడానికి సరైన బట్టలేక
మంచునే దుప్పటిలా కప్పుకుని
చలికి తట్టుకోలేక
జనసంచారం పలచబడిన వేళ
చీకటినే మరుగ్గా చేసుకుని
ఏ అర్ధరాత్రో దగ్గరగా జరిగినవాళ్ళు
తొలివెలుగు వాసనని పసిగట్టడంతోటే
దూరంగా తొలగిపోతున్నారు
కళ్ళనిండా నిద్రకైనా నోచుకోని దురదృష్టవంతులు వారు
దీపం వుండగా యిల్లు చక్కబెట్టుకుందామన్నా
ఇల్లే లేనివాళ్ళు

అందుకే
చీకటుండగానే సమస్యల్ని చక్కబెట్టుకుందామని
ప్రకృతి పిలుపు అందుకుని వీధుల్లోకి జారుతున్నారు

మిల్క్‌బూత్‌ల ముందర
మధ్యతరగతి చేంతాడు జనం
నగరంలో తెల్లారిందనడానికి తార్కాణం
కామధేనువులాటి పాలవేన్‌కై
గంటనుంచి పడిగాపులు కాసుకుంటూ
సీసాడు పాలను చేజిక్కించుకోడానికి
వెచ్చని పక్కనీ చిక్కని నిద్రనీ వదులుకుని
పుస్తెడు మంచుని నెత్తిమీద పెట్టుకుని
పాచిముఖాల్తో నిద్రకళ్ళతో
కొండవీటి చేంతాడు క్యూలో
కాఫీగత ప్రాణులు మధ్యతరగతి జీవులు !

బయటంతా ఎముకలు కొరికే చలి
కడుపులో కాఫీచుక్క పడితేగాని తీరని ఆకలి
మధ్యతరగతి కాఫీఆకలి బహువిచిత్రమైనది
గర్భిణీ స్త్రీ జిహ్వా చాపల్యంలాంటిది
అది ప్రాణాలు మెలిపెట్టే ఆకలికాదు
నరాలు పురిపెట్టే కడుపుమంట కానేకాదు
ముచ్చటగా గునిసే మురిపాల ఆకలి !
సరదాగా అలిగే సరసాల ఆకలి !!

పాకలమీద పాదుల్లా అల్లుకున్న పచ్చివెలుగు
పక్కనున్న మేడలమీదికి
క్రీపర్లా విస్తరించినా
రాత్రి తిప్పి వుంచేసిన కుళాయిల్లోంచి
ఏకధారగా నీర్లు కార్తి

బాత్‌రూముల్లో మద్దెల్లు మోగుతున్నా
కాలువలు చైతన్యంతో పొర్లుతున్నా
మేడల తలుపులింకా తెరుచుకోలేదు
చైతన్యం యింకా అక్కడ పరుచుకోలేదు
ఏ పనిమనిషో వచ్చి
గుడిలో పూజారిలా మేలుకొలుపులు పాడాలి
అప్పుడు సింహద్వారం తలుపులు తెరుచుకోవాలి
అందాకా ఆ భవంతుల్లోకి వెల్తురు దూరదు
బెడ్‌రూముల్లోకి సైతం చైతన్యం ప్రవహించదు

తూర్పున అప్పుడే విప్లవం పగిలి
చుట్టూ రక్తం చెదిరినట్టు
ఆకాశం ఆకొసన ఎరుపు
అది ఉడుకు రక్తపు సింధూరం ఎరుపు

మొదట్లో
చిన్నారి చిర్నవ్వు పెదాల ఎరుపై
తర్వాత
కన్నెపిల్ల అరచేతిలో పడిన గోరింటాకు రంగై
అటుపిమ్మట
పెళ్ళికూతురి కాళ్ళ పారాణి ఎరుపుగా ముదిరి
ఆపైన
గృహిణి తాంబూలపు నాలుక ఎరుపుగా చిక్కబడి
చివరకు
ముసలిముత్తయిదువ నొసటి కుంకుమ రంగుగామారి
ఒక్కొక్క ఛాయా పెరిగి
తూర్పు ఆకాశమంతా
చిక్కని ఎరుపుగా
ప్రాణాలు తోడే ఆకలి మంటగా
రక్తం కళ్ళాపి జల్లిన యుద్ధభూమిగా

అంతటా ఎర్ర రంగే పరచుకుంది

తూర్పున ఆమూల మూడు మబ్బుతునకలు
యుద్ధంలో గాయపడి పారిపోతున్న ఏనుగులు
వాటి మూపులమీద ఎర్రటి మచ్చలు
గుళ్ళు దిగబడిపోయిన గాయాలు
గాయాల్తో తొందరగా నడవలేక
నిస్సత్తువతో నెమ్మదిగా కదుల్తూ
ఈ మహానగరంలో తలదాచుకోడానికి
చిక్కని చెట్లగుబురులైనా లేక
శివార్లలో చిట్టడవిని వెతుక్కుంటూ
ఎంతకీ ముగియని ప్రస్థానం సాగిస్తూన్న మబ్బులు

చూస్తుండగనే తటాలున వెలుగుకాయ పగిలి
కాంతికిరణాలు పకపకా నవ్వుతూ ఎగిరాయ్
ఎలక్ట్రిక్ తీగలకు వేలాడుతోన్న
మంచుబిందువుల గుండెలు
ఒక్కసారిగా సిగ్గుతో ఝల్లుమన్నాయ్

ఆగుండెల్లో ఇంద్రధనుస్సులు వెలిగి
అవి పువ్వులని భ్రమపడి
ఆ చుట్టూ తుమ్మెదలు కదలి
రాగంతీస్తూ ఎగురుతున్నాయ్
కొత్త రోజుకు అవి
స్వాగత గీతాలు ఆలపిస్తున్నట్టున్నాయ్

అడుగున నేలమీద
అప్పుడే వాలిన సన్నని వెలుగులో
తనలో విరగపూసిన పూలను చూసుకుని
విరబూసిన తన యవ్వనాన్ని తలచుకుని

గర్వంతో తుళ్ళిపడుతున్నాయ్ పూలచెట్లు
నిన్న సాయంకాలం ఇంకా సిగ్గువీడని మొగ్గలు
ఇవ్వాళ వసంతం జల్లుకున్న చక్కని చుక్కలు !

ఊరినిండా సౌందర్యం పరచుకున్నా
పట్టించుకొనే వాడిక్కడ లేదు
నిజానికి నగరంలో ఉషస్సుకన్నా
అడవిలో కాసిన వెన్నెలే మేలు

నిద్రతేలిపోయిన నిరుద్యోగులు
కొత్తరోజుమీద కొండంత ఆశతో లేచారు
ఈ తిరిగే కాళ్ళకు యీనాడన్నా
ఓ కుర్చీ దొరక్కపోదని
మళ్ళీ కొత్తగా
మనసునిండా ఆశను నింపుకుని
గదిబయట కొత్త వెలుగులోకొచ్చి
కాస్సేపు నిలిచి
గతంలోని అనుభవాలన్నీ మరిచి
ఉత్సాహంపరిచి
సరికొత్త మనిషిగా
ఆ రోజు దినచర్యకు శ్రీకారం చుడుతున్నారు
నిన్నటికి కార్బను కాపీ నిరుద్యోగులు
గానుగెద్దు పథికులు

గత మూడేళ్ళుగా వాళ్ళు
గాడిలోపడ్డ ముళ్ళు
తిరిగినచోటే తిరిగి
పాడిన పాటేపాడి
అరిగిపోయి ఆకారం మారిపోయి
అలసిపోయి బ్రతుకంటే ఆశపోయి

## 33

శీలా
వీర్రాజు

రాటుదేరి మనసంతా మోటుదేరి
ఉత్సాహం నీరుగారి నిర్జీవం రూపుదేరి
రాత్రికి ప్రాణాలమీద తీపిపోయినా
మళ్ళీ ఉషస్సు వెలిగేసరికి
కొత్త ఆశల చివుర్లేస్తాయ్
కోరికల పూలు పూస్తాయ్
అందుకే
ఉషస్సు
రేపు వికసించనున్న ఇవ్వాళ్టి మొగ్గ
అది ఆశకు చిహ్నం
ఉత్సాహానికి సూచి



# ఉదయం

వెల్లువలా కదులుతోన్న
పదాతిదళం పాదాల తొక్కిడికి రేగి
ఆకాశమంతా ఎర్రగా అల్లుకున్న దుమ్ములోంచి
విరుచుకు పడుతోన్న ఆర్టిలరి పేల్చిన ఫిరంగిగుళ్ళు
ఎర్రన్ని ఆకాశంలోకి దూసుకుపోతోన్న కిరణాలు
ఆ వెనకనే విజయోత్సాహంతో ఠీవిగా
ఛాతీ విరుచుకుని కదలివస్తున్నాడు
విజయంలోంచి ఉదయించిన మహావీరుడు
సర్వసైన్యాధ్యక్షుడు సూర్యుడు

చీకటిని జయించి వెలుగును ప్రతిష్ఠించి
నగరంలో అడుగు పెడుతోన్న సూర్యుడికి
చెట్లసిగల్లో ఇళ్ళ మూపుల్లో
ఎర్రటి తోరణాలు వేలాడగట్టి
స్వాగతం పలుకుతోంది
అప్పుడే నిద్రలేచిన నగరం

రాత్రంతా మత్తుగా నిద్రపోయిన మేడలు
ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్నట్టు
ఒక్కటొక్కటిగా కిటికీలు తెరుచుకుని

ఒక్కసారిగా వెలుగును చూడలేక
కళ్ళు రెప్పల్ని టపటపా కొట్టుకుంటున్నాయ్
వచ్చిన యీ మార్పును నమ్మలేక
విచిత్రంగా వెలుగును చూస్తున్నాయ్

నిన్న సాయంకాలం వచ్చి
రాత్రంతా కదలకుండా నిలిచి
కుళ్ళిపోయి
పాపాల పురుగుల్తో లుకలుకలాడ్తూ
కంపుకొట్టే నిలవనీటి చీకటిని నెట్టేస్తూ
వెల్లువలా
ఉరుకుల్తో పరుగుల్తో వస్తోంది
ఎర్రని లేత ఎండ కొత్తనీరు
నగర నదీగర్భంలోకి

పట్టుమని పదేళ్ళున్నా పూర్తిగా చదవక
కన్నవాళ్ళిద్దరూ కష్టించినా ఇంటిల్లిపాదికీ గడవక
పదిహేనేళ్ళ బాలవయసులోనే
జీవన సమరంలోకి ఉరికి
నిత్యజీవిత సమస్యల్తో పోరాడ్తూ నిలిచి
ఆటపాటల్ని, అమాయక ఊహల్ని ఆవలకు నెట్టి
పెద్దపెద్ద ఆలోచన్లతో గిడసబారి
బాల్యాన్ని పూర్తిగా మర్చిపోయి
ఇంట్లో వేణ్నీళ్ళకి చన్నీళ్ళు చేరుస్తూ
ఆరుబయట ఎండలోనిలిచిన కుటుంబానికి
మూడంత మబ్బులా నీడని పరుస్తూ
వెలుగుతోనే ఊళ్ళోకి బయలుదేరి
ఇంటింటికీ వార్తల్ని మోసుకెళ్తున్నారు
వార్తాహారులు పేపరు కుర్రాళ్ళు

మధ్యమధ్య పత్రికల్లో పతాకశీర్షికల్ని
వీధుల్లో వెదజల్లుతూ పోతున్నారు

తొలివెలుగుతోనే యిల్లువదిలి
ఇంటిచుట్టూ కొండలా పేరుకున్న పెంట వదిలి
ఊరులేచేసరికే వీధులన్నీ ఊడ్చి
రోజంతా పేరుకున్న చెత్తంతా తుడిచి
రోడ్లమీద పెంటకుప్పల కురుపులచుట్టూ
రసిలా కారుతోన్న కుళ్ళంతా కడిగి
అనాకారి రూపాల్ని అందంగా తీర్చి
నగరం నిండా సౌందర్యాన్ని పరుస్తున్నారు
తమనితాము అలంకరించుకోవడం మానుకుని
నగరాన్ని సింగారించే ఊడ్పు పనివారు

పగలు వొళ్ళొంచి పనిచేసి
ఒంట్లో రక్తాన్ని చెమటగాపోసి
మట్టిని తడిపి అడుసుచేసి
ఎముకల్ని అరగదీసి శక్తిని గంధంతీసి
ప్రతిరోజూ యిటుకమీద యిటుక పేర్చి
గంధాన్ని ప్లాస్టర్‌గా పూసి నునుపుచేసి
నగరానికి ఆభరణాలుగా
ముచ్చటైన మేడలుకట్టే శ్రమజీవులు
పగలంతా పనిచేసిచేసి అలసిపోయి
రాత్రంతా వొళ్ళుమరిచి నిద్రపోయి
ఉదయం లేచేసరికి ఆలస్యమై
కళ్ళు తెరిచేసరికి పొద్దు బారెడై
పాములా పాకివస్తోన్న ఎండను చూసి భయపడి
పని దొరక్కపోతే రాత్రికి పస్తేనని
రానున్న రాత్రి ఆకలికి వెరచి యిప్పుడున్న ఆకలిని మరిచి
ఆదరాబాదరాగా కాళీ కడుపులతోనే

నగర కూడళ్ళలోకి చేరుకుంటున్నారు
ఉండడానికి సరైన పూరిపాకైనా లేక
ఊరివాళ్లకి పక్కా కాంక్రీటు భవనాల్ని కట్టే
దినదిన గండం నూరేళ్ళాయుష్షులవాళ్ళు
రోజువారీ కూలీలు తాపీపనివారు

మంత్రాలకు చింతకాయలు కాదుకదా
ఊదితే ఊడిపడేపగలమ్ముగ్గిన నేరేడుపళ్లనిసైతం రాల్చలేనివాళ్ళు
స్వర్గానికి నిచ్చెన్లు వేస్తామని
చచ్చిన వాళ్లని అక్కడికి చేరుస్తామని
వాళ్ళకడుపుల్ని చల్లారుస్తామని
ధైర్యంగా అబద్ధాలమీద అబద్ధాల్ని
మంత్రాల్లా వల్లించి
ప్రజల అమాయకత్వాన్ని ఆసరాచేసుకుని
వాళ్ళ మూఢనమ్మకాల్తో
బొజ్జల్ని నింపుకుంటున్నవాళ్ళు
నగరకూడళ్ళలో పరాయివాళ్ళ పంచల్లో
పంచెల్ని ఎగదోసుకుంటూ చేరి
జంధ్యాలు సవరించుకుంటూ కూచున్నారు
ఒళ్ళొంచకుండా బలిసే సోమరిపోతులు
తద్దినాలకి కాచుక్కూచున్న కాటికాడనక్కలు

ఊపిరి బిగబట్టి నరాల్ని పురిపెట్టి
శరీరాల్ని గట్టిగా ధనుస్సులా సంధించి
పరంపరగా శక్తి బాణాల్ని విడుస్తూ
చక్రాల్ని గిరగిరా తిప్పుతూ
ఎత్తొచ్చే సరికి ఏడ్పు ముఖంపెట్టక
జీవితంలో అలవాటైన చిర్నవ్వే తోడుగా
ఆరెట్టి గుణించిన ఆనందం ఆసరాగా
ఫెళుఫెళుగా టపాకాయలా పేల్తూ

అవలీలగా ఎత్తెక్కించేసి,
బాధల్ని చూసి భయపడితే
బ్రతుకుని యీడ్చడం భారమని
కష్టాల్ని చిర్నవ్వుతో ఢీకొంటేనే
గట్టెక్కి అవతల పడొచ్చని
ఎత్తుపల్లాల జీవనమార్గాల
కష్టసుఖాల కావడికుండల
జీవితసారం మూటవిప్పి
వేదాంతి చిర్నవ్వుల్ని పంచుకుంటూ
రయ్యిన దూసుకుపోతున్నారు రైటికులు
చైతన్యం మూర్తీభవించిన చక్రపాదులు

ఆకాశవాణి నిలయంలో
అప్పుడే భజన మొదలైంది
మంత్రుల నిలయాల్లో సైతం
భజన్ల కోలాహలం ఆరంభమైంది
భక్తులు మందలు మందలుగా వచ్చి
బృందాలు బృందాలుగా చీలి
గొంతు చించుకుని భజన్లు చేస్తున్నారు
ముందే పూజార్లకు ముడుపులు చెల్లిస్తున్నారు

స్వామివారి దర్శనార్థం భక్తులు సరేసరి
చిల్లర దేవుళ్లు సైతం తరలివచ్చారు
మందీ మార్బలంతో ఠీవిగా బైటాయించి
భజనకూటాలకు అధ్వర్యం వహిస్తున్నారు

గర్భగుడి తలుపులింకా తెరవనేలేదు
బైటప్పుడే తొక్కిసలాట ఆరంభమైంది
భక్తుల కోర్కెలు లెక్కిస్తే బండెడు
రూపాయల్లో అవి లక్షలకు లక్షలు !

అంతబరువునూ మీదేసుకున్న స్వామివారు
అలసిపోకముందే తమకోర్కెల్ని చెప్పుకుని
అభయముద్రలు అందుకుందామని
ఒకరినొకరు తోసుకుంటూ ముందుకొస్తున్నారు
పచ్చి మంచినీళ్ళన్నా ముట్టుకోకుండా
పరగడుపునే పరుగెత్తుకొచ్చిన భక్తులు
మంత్రాలయాలచుట్టూ తిరిగే రాయకీయపక్షులు

నగరంలో ఉదయానికి తొరాక్కణం
గాలిలో ఎగిరే భజన్ల కోలాహలం
గుళ్ళో పూజార్ల మేల్కొలుపులకన్న
ఆకాశవాణి నిలయంలో
అరిగరిగిపోయిన భక్తిగీతాల ప్రసారంకన్న
మంత్రుల నిలయాల్లో గదులన్నీ ప్రతిధ్వనించి
రోడ్లెక్కే భజన్లే తొరాక్కణం
అక్కడ పార్కుచేసిన టాక్సీలూ కార్లూ
ఉదయం ఎంత పొద్దెక్కిందో సూచించే ముళ్ళు
అక్కడ వినిపించే భక్తుల కంఠాల్లో శృతిమెట్లు
మేడ దిగుతోన్న మూలవిరాట్టు
ఎన్నో మెట్టుమీద కాలుమోపిందీ చెప్పేస్కేలు

కాలినడకన పోయే భక్తులంటే
కాపలా పోలీసులకు సైతం చిన్నచూపే
అందుకే కార్లమీద తప్ప కాలినడకన పోరు
ఏడుకొండలూ నడిచి ఎక్కినవాళ్లు సైతం
పాదచారులుగా అసలు అక్కడికి వెళ్ళరు

చూస్తుండగనే రోడ్లన్నీ చిగుర్లువేసి
కాస్సేపట్లోనే మొగ్గలుతొడిగి పూలుపూసి
నగరం రంగులు పరిచే బృందావనంలా వుంది
పరిమళాలు చల్లే పూలవనంలా వుంది

శీలా
వీర్రాజు

## 41

కొత్తరోజు పురిటివాసనని మోసుకొని
కొమ్మకొమ్మకీ వెళ్ళి పలకరిస్తోంది గాలి
పుట్టిన బిడ్డని పుట్ట పుట్టకీ తిప్పి
తనలో తనే మురిసిపోతోంది ఎండ
రంగురంగుల సీతాకోక చిలకల్లా
నగర నందనవనంలో విహరిస్తున్నాయి కార్లు
గొంగళీ పురుగుల్లా కదుల్తున్నాయి ఆర్టీసీ బస్సులు

రాత్రి చలికి గడ్డకట్టిన చైతన్యం
ఉదయం ఎండకి కరిగి ప్రవహిస్తున్నట్టు
రోడ్లమీదంతా జనప్రవాహం
రోడ్లకింద డ్రైనేజీల్లో జలప్రవాహం

బ్రతుక్కి ఒక్కసారన్నా జీవితాన్ని కడగక
మనసుకు పట్టిన మలినాల్ని తుడవక
దుమ్మూధూళీ నిండి
పుచ్చులూ పురుగులూ పట్టి
దుర్వాసనకొట్టి పరిసరాలు పాడైనా
మనసు మురికిని కడక్కపోయినా
ప్రతిరోజూ నిద్రలేవడంతోనే క్రమంతప్పక
సువాసనలు వెదజల్లే సబ్బుల్తో స్నానంచేసి
ఒంటికి అంటిన మలినాల్ని కడిగి శుభ్రంచేసి
నిర్మలంగా తాజాగ్గా కనిపించడం
అది మానవనైజం
కనుకనే ఉదయంపూట
డ్రైనేజీల్లో ఎడతెగని ఆ నీటి ప్రవాహం
నగర శరీరంలో డ్రైనేజీ సిరల్లో సరేసరి
కుళాయి గొట్టాల ధమనుల్లోనూ
ఆ వేళప్పుడుమాత్రం
తుళ్ళిపడుతూ ఒకటే చైతన్యం !

కలవారికోడలు 'కనక కామాక్షి'
అభ్యంగన స్నానం చేసొచ్చి
పోర్టికోలో అలవోకగా నిల్చి
ఆరబెట్టుకుంటున్న కురుల్లో చిక్కుపడి
చివరికి తప్పించుకుని బైటపడిన ఎండ—
గుమాస్తా గోపాలరావుభార్య
పిల్లలు మారాంచేస్తే రోజూ మిఠాయిలిచ్చే స్తోమతులేక
వేయించిన వడియాల్ని తలోరెండూ పడెయ్యొచ్చని
వెంకుటింటిపెరట్లో ఎండబెట్టిన వడియాలమీద వాలి
అతుక్కుపోయి ఆఖరికి వూడిపడిన ఎండ—
చెప్పులుకుట్టే సైదులుపెళ్ళాం
ఇరవై రోజులుగా విప్పకుండాకట్టి
ఎండెక్కడంచూసి వొంటికి చింకిపాతచుట్టి
ఉన్న ఒక్కగానొక్క గట్టిచీరనీ తడిపి
పాకమీదఆరేస్తే చూసిజాలిపడి
పరుగెత్తుకొచ్చి వాలినఎండ—
మేడమీది కామాక్షి
కళ్ళల్లో నిప్పులుపోసుకునేంత వెచ్చగా
ఆరేసిన చీరమీద హాయిగా పరచుకున్న ఎండ

ముందుగా ఎండొచ్చి
తమ మేడమీదే వాలడంచూసి
ఎండంతా తనదేనని ఆశపడింది పాపం కామాక్షి!
కానీ కాస్సేపట్లోనే
చూస్తున్న కళ్ళముందరే
హెచ్చుతగ్గుల్లేక
ఊరంతా అల్లుకున్న ఎండనుచూసి
మనసంతా కుతకుతలాడిపోయింది
మూతి మూడువంకర్లు తిరిగిపోయింది

ఉషస్సులో మాయలాకమ్మిన పురిటివాసన
వెలుగుతోపాటు గాలిలోకరిగి
వికసించిన పూలవాసన గుప్పునఎగిరి
ఉదయం విచ్చుకునేకొద్దీ
కాఫీ టీల పొగల్తో ఘుమఘుమలాడి
మరో అర్ధగంటలోనే
పొగలూ సెగలూ చల్లబడి
ముక్కుపుటాల్ని బద్దలుచేస్తూ
మసాళాఘాటు గుప్పుమని
ఎండెక్కేకొద్దీ ఆవిర్లు యిగిరి
నగరమంతా అల్లుకుంటోంది
వికారంగా పెట్రోలువాసన

రోడ్లమీద రేసుగుర్రాల్లా
ఒకదానితో ఒకటి పోటీపడుతున్నాయి కార్లు
ఒకదాన్నొకటి తరుముకుంటున్నాయి
రేచుకుక్కల్లా స్కూటర్లు

కార్ల వెనకసీట్లలో
నలక్కుండా ముడుచుక్కూచున్నవాళ్ళ
ఇనప్పెట్టెలో పెట్టిన వందరూపాయినోట్లు
వాళ్ళకళ్ళల్లో కనిపించే ఫుట్‌పాత్‌లమీద
చెప్పుల్ని అరగదీసుకుపోయే జనం
ఊరికే గలగల్లాడే చిల్లరపైసలు

జేబుల్లోపైసలేస్తే గలగలమంటాయ్
నోట్లయితే గుంభనంగా ఒదిగిపోతాయ్
అందుకే కారుల్లో మనుషులు
నోరుమెదపకుండా మౌనంగా కూచున్నారు
కాలినడకన పోయేవారుమాత్రం
కబుర్లుచెప్పుకుంటూ కదుల్తున్నారు

రోడ్లమీద గుత్తులు గుత్తులుగా
విరబూసినపూలు బడిపిల్లలు
అమాయకమైన వాళ్ళ ముఖాల్లో
మలినంకాని వెలుగులే పరిమళాలు

ఆ పరిమళాల్ని చుట్టూరా చల్లుకుంటూ
కలకల్లాడుతూ చిలకల్లా పలుకుతూ
గాలికి జాలీగా ఊగుతూ
జట్లు జట్లుగా
బస్ స్టాపుల్లో, బడిఆవరణల్లో
ఫుట్ పాత్ లమీద, రిక్షాలమీద
ఇంచుమించు నగరం అన్నిదారుల్లో
రోడ్లన్నీ చిగిర్చి పూలుపూసినట్టు
యూనిఫారాల్లో ముచ్చటైన బడిపిల్లలు

ఎటుచూస్తే అటు దుకాణం
నగరానికి ఒక లక్షణం
వీధికి అరడజను షాపులు
పేటకి ఒక మార్కెట్టు
మొత్తం నగరానికి
ప్రతిరోడ్డూ ఒక బజారు

రోడ్లన్నిటికీ దుకాణాలే అంచులు
అవే నగరానికి స్వాగత తోరణాలు
తోరణాల స్వాగతాలకి మురిసి
నగరానికి ఎగబడుతుంటారు జనం
పాపం ! వాళ్ళకి తెలీదు
ఇక్కడ దోపిడీకి దార్లు రకరకాలని
అన్యాయం అంగడిలో బహుముఖాలని

రోడ్లపక్క ఒక్కటొక్కటిగా
కళ్లు తెరుస్తున్న దుకాణాలు
దారినపోయే దానయ్యలు
ఇంకా లోపలికి అడుగెట్టలేదేమని
దొంగచూపులు చూస్తున్నాయ్

దేవుడి పటాలముందు షావుకార్లు
ఆగరొత్తులు వెలిగించి
నయాంపైస ఎత్తు పంచదార నైవేద్యంపెట్టి
బొజ్జలమీద నిలవక జారిపోతున్న
పంచెల్నీ, పంట్లాముల్నీ ఎగదోసుకుని
దురదేస్తే గోక్కుని
ఆ చేతుల్తోనే నమస్కారం విసిరి
రేపు ఉదయంవరకు మళ్ళీ నైవేద్యం వుండదని
రాత్రి దుకాణం మూసేవరకు యిటు చూడొద్దని
చేయబోయే అన్యాయాలకీ అక్రమాలకీ
పర్మిషన్లు సంపాదిస్తున్నారు

షాపులు తెరవడమే తరవాయి
గిరాకీకేం కొదువలేదు
దుమ్ము యింకా దులపకుండానే
లోపలికి దూరుతున్నారు జనం
ఇక్కడ ప్రతివస్తువుకీ గిరాకీ ఎక్కువ
వంటాముదం పెట్టినా వట్టిగడ్డి పెట్టినా
తోసుకుని మరీ ఎగబడతారు
చూస్తుండగానే ఖాళీ చేస్తారు

కాలేజీ రోడ్లమీద ఫేషన్ పేరేడ్‌లు
అడపా దడపా ఏక్సిడెంట్‌లకు షార్ట్ కట్‌లు
తొమ్మిదిన్నర దాటితే ఆ రోడ్లన్నీ

అంతకు రెట్టింపు వయస్సు పడుచుల్లా
సోయగాలు పోతుంటాయ్
ట్రాఫిక్‌ని జామ్‌చేసి
యాక్సిడెంట్‌లని కురిపిస్తాయ్

సరిగా ఆ వేళప్పుడే
దరిద్రం పెంటకుప్పల్లా పేరుకుపోయి
అస్థిపంజరంలాటి భయంకర దృశ్యాలు నిండి
గుండెల్ని పిండే గల్లీలు
నగరం గుండెచుట్టూ
అడుగడుగునా అనేకం కనిపిస్తాయ్

అక్కడ
రాచకురుపుల్లాటి చెత్తకుండీలమీద
అర్ధగంటనుంచీ పడిగాపులుకాస్తూ
మురికిలోపడి పందుల్లా దొర్లుతూ
హోటల్ క్లీనర్ తెచ్చిపడేసిన
తొలివాయి పులిస్తరాకులకై
కాకుల్తో కాట్లకుక్కల్తో
అప్పుడప్పుడు మదించిన ఆంబోతుల్తో
ఒక్కొక్కప్పుడు తోటివారితో సైతం
హోరాహోరీగా పోట్లాడి
గెలిచినప్పుడు ఎంగిలిమెతుకుల్ని చేజిక్కించుకుని
ఓడినప్పుడు గాయాల్ని మిగుల్చుకుని
పట్టెడు అన్నానికి పశువులా మారిన
ఎండుడొక్కల అన్నార్తులు
వాళ్ళ అరుపులూ ఆర్తనాదాలు!
వాళ్ళ ధైర్యాలూ భయాలు!

అక్కడ గాలిసైతం
ఆకలిసంగీతాన్ని వినిపిస్తుంది

శిలా
వీరాజు

అక్కడ నేలసైతం
దైన్యాన్ని ఒలకబోస్తుంది

ఆ గల్లీల్లోంచి నాగరికులుసైతం వెళ్ళకతప్పదు
అక్కడ జరిగే ఆకలిపోరాటాల్ని వాళ్ళు చూడకతప్పదు
నయాపైస ఖర్చులేకుండా దొరికే వినోదం అది
ఆగిపోకుండా పోరాటం కొనసాగితే
రోజంతానిలబడి చూడ్డానికిసైతం వాళ్ళు రడీ

హోటళ్ళలో రెండోవరుస లేస్తున్నా
ఇళ్ళల్లో వంటింకా కానేలేదు
అవసరమైతే హుష్‌కాకి మంత్రంవేసి
మార్కెట్లో కిరసనాయిల్ని మాయంచేసి
దుకాణంమీద నోస్టాక్ బోర్డుని
మహానాయకుడి ఫొటోలా ప్రముఖంగా తగిల్చి
బొజ్జల్ని తడుముకొనే షావుకార్ల చలవవల్ల
ఎంతకీ తెమలని వంటల్తో
పొద్దుట్నించీ గింజుకునే గృహిణుల్ని
గట్టిగా కసురుకోనూలేక
ఆలస్యమైతే ఆఫీసరువేసే అక్షింతల్ని
నిర్లిప్తంగా నెత్తిన చల్లుకోనూలేక
అలుసైనది ఆలేగనుక
ఆవిడమీదే విరుచుకుపడి
ఆరాటపడిపోతున్నారు క్లాస్‌త్రీ క్లాస్‌ఫోర్‌లు

ఆఫీసర్లకు ఆ బాధలేదు
కేరియర్లే ఆఫీసులకు తరలివస్తాయ్
అర్ధాంగులమీద విసుక్కోవలసిన అవసరంరాదు
ముచ్చటైన వయసుంటే
స్వీట్‌గా ఓ ముద్దిచ్చుకుని మరీ రావచ్చు

కాకుంటే కనీసం
ఛీరియో చెప్పి తాపీగా కదలొచ్చు

నగరంలో ఉదయం పదిగంటలు
జనం యిళ్ళొదిలి రోడ్లుపట్టే సమయం
ఇళ్ళల్లో మనుషులకన్నా
రోడ్లుపట్టినవాళ్ళు రెండింతలు
ఆవేళప్పుడు నగరంలో రోడ్లు
జనప్రవాహంతో పొర్లి పోయే కాలవలు
అప్పుడు ప్రతిరోడ్డూ జనంతో తుళ్ళుతుంది
ప్రతిచోటా చైతన్యం చిందుతుంది

రోడ్డంతా తమదేఅని కదిలే ఆర్టీసీబస్సులు
చీమలబారుల్లా సాగే సైకిళ్ళు
కంగారే పెట్రోలై పరుగెత్తే కార్లు
హడావుడి చేస్తేగాని కదలని ఆటోలు
భూతాల్లా విరుచుకుపడే లారీలు
లోపల కూచున్నా రోడ్లమీద నడుస్తున్నా
మనిషంటే లక్ష్యంలేని పొగరుమోతు రిక్షాలు
కందిరీగల్లా గింగుర్లుపెడ్తూ
దారిన పొయ్యేవాళ్ళని భయపెడ్తూ
రోడ్లమీద దూసుకుపోయే మోటర్ సైకిళ్ళు
ఆ వెనకే తూనీగల్లా స్కూటర్లు
ఫుట్‌పాత్‌లు చాలక రోడ్డుదిగి
ప్రాణాల్ని టిఫిన్ బాక్సులతోపాటు భద్రంగా
అరిచేతుల్లో పట్టుకుని నడిచే పాదచార్లు
గుమాస్తా బ్రతుకుల్లాగ
కదల్లేక కదిలే ఒంటెద్దుబళ్లు
మధ్యమధ్య అచ్చోసిన ఆంబోతులు
విచ్చలవిడిగా విహరించే ఊరకుక్కలు

ఏ రోడ్డులోకి తొంగిచూసినా
ఆవేళప్పుడు నిండుగా ప్రవాహపు వెల్లువ !

ఎత్తయిన మేడెక్కిచూస్తే
రోడ్లే కదిలి నడుస్తున్నట్టుంటాయ్
కిందనుంచుని చూస్తే
మనమీదే విరుచుకు పడుతున్నట్టుంటాయ్

ట్రాఫిక్‌ని కంట్రోలు చేయలేక
గిలగిల్లాడుతుంటారు పోలీసులు
అయినా ఏరోడ్డుమీదో ప్రమాదం పగుల్తుంది
ఎవరి కాలో చెయ్యో విరిగి రక్తం వొలుకుతుంది
చక్రాలు విరగడం, మడ్గార్లు అణగడం
బోర్లాపడి నేలను కరవడం
ఇంకా చిల్లరచిల్లర ఏక్సిడెంట్లు
లెక్కిస్తే రోజుకి కొల్లలు కొల్లలు

ప్రమాదాలకి నగరంలో
ప్రతిరోడ్డూ ఒక జారుడుమెట్టు
క్షణం ఏమరుపుగా వుంటే
సరాసరి హాస్పిటల్ కే పోవచ్చు

రోడ్లమీద జనప్రవాహానికి
ఆనకట్టలు ఆఫీసులు
ఇళ్ళల్లోంచి, గల్లీల్లోంచి
వీధుల్లోంచి, మెయిన్ రోడ్లమీంచి
ప్రవాహంతోపాటు కొట్టుకొచ్చి
మేటవేసిన అవినీతిలో
కూరుకుపోతోన్న ఆఫీసులు

ఆఫీసుల్లో హాజరుపట్టీ నిండాలంటే
కనీసం పదకొండు కావాలి
పై ళ్ళుకదలడానికి పన్నెండవ్వాలి
సాయంకాలం అయితేగాని సంతకంకాదు
లంచ్ కీ లంచానికీ
ప్రత్యేకంగా టైమేంలేదు
ఆకలివేయడమే తరవాయి
చేతులుచాచి అందుకోవడం రివాజు

మూడేళ్ళలోనూ మొదటిసారిగా
ఎక్కడలేనిజాలీ ఒలకబోసినట్టుగా
ఎంప్లాయ్‌మెంటువారు పంపిన ఇంటర్వ్యూకార్డుని
ఉద్యోగంఆర్డరులా పట్టుకుని మురుస్తూ
అక్కడెక్కడో అమూలవున్న ఆఫీసుకి
ఇచ్చిన టయిముకి చేరాలని
రెండురోజులు ఉదయం టిఫిన్లుమాని టీతాగి
రూపాయి ఆదాచేసి రిక్షాఎక్కి
హడావుడిగా ఆఫీసుచేరిన ఉద్యోగార్థి
చెట్లకిందా మెట్లమీదా
చీమలపుట్టల్లా చేరిన తోటివారిని చూసి
నీరుగారిపోవడం—అతి సహజం

ఉన్న పాతికలోనూ అరడజనుమంది చేతుల్లో
కొత్త రూపాయినోట్లల్లా
పరిచయపత్రాలూ, సిఫార్సులేఖలూ
గాలికి రెపరెపలాడ్తూ కనిపిస్తే
గొంతు తడారిపోవడం—
'అయ్యగారికి పనుందని
లంచయ్యాక ఇంటర్వ్యూ అవుతుందని'

శీలా
వీ|్రాజు

తాపీగా వచ్చి దవాలా బం|్రట్రోతు వినిపిస్తే
కళ్ళుతిరిగి కూలబడడం—
ఇంటర్వ్యూలో పేరూ వూరూ అడిగి
చదివిన సబ్జక్టు పిసరంతైనా ముట్టక
'ఆల్ రైట్ నువ్వెళ్ళొచ్చం'టే
కళ్ళల్లో నీళ్ళు తిరగడం—
అతురాలా అతిసహజం

ఆఫీసుల దైనందిన దినచర్యల్లో
ఇలాటి దృశ్యాలు మామూలే
ఉద్యోగార్థుల సుదీర్ఘ నిరుద్యోగ పర్వాల్లో
అడుగడుగునా యివి వుండేవే

అయినా అందరితోపాటు రోడ్లుపట్టి
అయిదు నిమిషాలు ముందే ఆఫీసుకొచ్చి
పడిగాపులు కాయడం మానరు
|్రపజావాహినిలో తామూ ఓ కెరటమై
ఉవ్వెత్తునలేచి విరుచుకుపడ్తూ
చైతన్యంతో కదలిపోకుండా వుండరు

ఉదయంపూట నగరంలో
|్రపతిమనిషీ ఒక అల
వ్యాపారైనా నిరుద్యోగైనా
నిలువెల్లా ఉత్సాహాన్ని నింపుకుని
రోడ్లనీ బళ్ళనీ
షాపుల్నీ ఆఫీసుల్నీ
నగరంలోని అడుగడుగునీ
చైతన్యంతో తడుపుతాడు

## 52

జడత్వాన్ని గొయ్యితీసి పాతుతాడు
ఆసమయంలో ఎటు చూసినా
ఎగసిపడే చైతన్యపు వెల్లువ
అందుకే
నగరంలో ఉదయం
చైతన్యానికి చిహ్నం



# మధ్యాహ్నం

రాళ్ళు దాటి రైల్వేలైను దాటి
రోడ్లు దాటి యిరుకు దార్లు దాటి
ఫుట్‌పాత్‌లు దాటి పోలీసు బీట్‌లు దాటి
ఇళ్ళు దాటి ఎత్తయిన మేడలు దాటి
నగరం మధ్యలో నిటార్గా ఆకాశంలో నిలిచి
పదవీ పలుకుబడీకల ప్రజానాయకుడిలా
అధికారంతో వెలిగిపోతున్నాడు సూర్యుడు

ప్రభుత్వ ఉత్తర్వుల ముఖాలమీద
అధికార పత్రాలమీద
శాసన సభ్యుల లెటర్‌పాడ్‌లమీద
కొట్టొచ్చినట్టు వెలిగిపోయే
అధికార ముద్రలా వున్నాడు
నగరం నెత్తిమీద ఆకాశానికి మధ్యగా సూర్యుడు

నిగనిగలాడుతోన్న లేతనీలాకాశం
అప్పుడే పుస్తకంలోంచి చించిన
కొత్త బేంకుచెక్కులా వుంది
ఆ అడుగున చేసిన సంతకంలా
జిగేలుమంటున్నాడు సూర్యుడు

నింగినీ నేలనూ ఏకం చేస్తూ
చిక్కగా అల్లుకున్న తెల్లనికాంతి
ప్రజల మనసుల్ని దోచుకుని
పీఠం వేసుకున్న అతగాడి పలుకుబడి
గాలినీ నేలనీ మండిస్తూ
వెచ్చగా రాలుతోన్న ఎర్రని ఎండ
ఎత్తయిన గద్దెక్కి కూచుని
ప్రతాపం చూపిస్తోన్న అతగాడి అధికారం

పదవి వున్నచోట అధికారం తప్పదు
అధికారం వున్నంత మాత్రాన
విధిగా పలుకుబడి వుండదు
పదవీ పలుకుబడీ ఒకేచోట కలవడం
ఒకరిలోనే నిలవడం
అది ఎక్కడోగాని జరగదు

పదవికి పలుకుబడి ఒక అలంకారం
అలంకారాలు యిప్పుడు ఔట్ డేటెడ్
సింప్లిసిటీ యీనాటి ఫాషన్
కనుకనే మన నాయకులకు
పదవులుమాత్రం కావాలి
పలుకుబడి లేకున్నా ఫరవాలేదు

అందుకే
మంత్రుల ముఠాల్లో, మదించిన బోర్డుల్లో
జిల్లా పరిషత్తుల్లో, జేబులునిండే సంస్థల్లో
అకాడమీల్లో ,ఆశ్రితుల గొడుగు సమితుల్లో
హాహాకారమండల్లో, స్వాహాకార బేంకుల్లో
సోమరిపోతు సంఘాల్లో, కాలక్షేపం కమిటీల్లో
పెద్దమనుషులు పదవులకై పడిచస్తుంటారు

ప్రజాసేవకు పదవే సిసలైన దారని
తిరునాళ్ళజనంలా ఎగబడుతుంటారు
అవసరమైతే అమాయకుల ప్రాణాల్ని ఖర్చుపెట్టి
ఉద్యమాల్ని ఎగరేస్తుంటారు, పదవుల్ని అధిష్ఠిస్తుంటారు

కాని—

మధ్యాహ్నంపూట సూర్యుడు
వెలుగూ వేడీ వున్నవాడు
పదవీ పలుకుబడీ కలవాడు
అక్షరాలా అతను ప్రజల నాయకుడు

శీతకాలపు సూర్యుడే అయినా
తలెత్తి చూడ్డానికి వీల్లేదు
పొగరుమోతుగా కళ్ళెత్తిచూస్తే
సూదుల్లా వెలుగుముళ్ళు కళ్ళల్లో గుచ్చుకుని
చీకటి రక్తం బొటబొటా కారుతుంది
నిమిషాల పర్యంతం కళ్ళముందు
అందమైన వెలుగు హరించుకుపోతుంది

అందుకే మధ్యాహ్నంపూట జనం
ఎక్కువగా తలెత్తి చూడరు
నాయకుడ్ని ప్రశ్నించడం మర్చిపోయి
ఆజ్ఞల్ని శిరసావహించే అనుయాయుల్లా
తలొంచుకుని మరీ పోతుంటారు

ఆకాశపు అరగాణిలో కురిసి
కాలువలుకట్టి వాగులు పట్టి
అడ్డకట్టలు వేసిన మేఘాల అలుగులమీంచి పొర్లి
నగరాన్ని ముంచెత్తుతోంది
చిక్కని మధ్యాహ్నపు ఎండ
చలికి బిగుసుకుపోయిన ఒంటిమీద

దూలగుండాకు తగిలినట్టు చివచివలేస్తూ
చీమల్లా కుట్టూ సూదుల్లా గుచ్చుతూ
రోకలిబండలా జారుతోంది

కంటికి ఆనని రూపంతో
చురుక్కుమనిపించే చూపుల్తో
వెలుగుబంతిలా వెలిగిపోతోన్న సూర్యుడ్ని చూసి
జడిసిపోయి బితుకు బితుకుగా
ఎక్కడికక్కడే ఒదిగొదిగి
దాక్కుంటున్నాయి నల్లని నీడలు

నాయకుడి ప్రాపకంతో
నాలుగు తరాలపాటు
కడుపులో కాఫీ కదలకుండా
తనూ తనవాళ్ళూ హాయిగా బ్రతగ్గల
బరువయిన పదవొకటి పొందాలని
పడిగాపులు కాచుకున్న వినాయకులు
సూర్యుడికి దగ్గరగా ఎత్తుగా నిలచిన మేడలు

నగరంలో రోడ్ల పక్క
కుక్కగొడుగుల్లా మొలిచిన ఫుట్‌పాత్ దుకాణాలు
ఎండకి అక్కడక్కడ వొంటిమీద
ఉబ్బెత్తుగా లేచిన చెమట పొక్కులు

అధికార్లకి గొడుగుపట్టి
ఎండావానల్లో తాము తడిసి
ప్రభు భక్తిని చాటుకొనే సేవకులు
దైన్యమంతా ముఃఖంలో నింపుకుని
అక్కడక్కడ అటెన్షన్‌లో నిల్చున్న చెట్లు

నగరంనిండా సాలిగూడుల్లా
అల్లిబిల్లిగా అల్లుకున్న

# 57

ఎలక్ట్రిక్, టెలిఫోను తీగలు
అందంగా మెరిసిపోతున్న జరీపోగులు

ఎండపూతలో నగరం
వింతకాంతితో వెలిగిపోతోంది
అప్పుడే పాలిష్ చేసినట్టు
నునుపుగా మెరిసిపోతోంది

వెలివేసిన మురికివాడల పూరిళ్ళలోకి
పదిమందీ చూస్తుండగా పెద్దమనిషిలా
పబ్లిక్గ్గా అడుగెట్టడానికి తటపటాయిస్తున్న దానిలా
గుమ్మంముందు తచ్చాడుతోంది
పొద్దున్నుంచి ఎండతో చెట్టపట్టాలేసుకుని
నగరమంతా ఖుషీగా తిరిగిన గాలి
జాలిపడి సూర్యుడు పంపిన ఎండమాత్రం
సన్నగా సళాకుగా సాగిసాగి
ఇళ్ళకప్పుల్లోంచి లోపలికి దూరి
నిలువునా వేలాడేసిన ట్యూబులైట్లై వెలిగి
చీకటి కొంపల్లో చిరువెలుగులు పరుస్తోంది

రోడ్ల మీద పొర్లి ప్రవహించే వరద తగ్గి
తోసుకుపోయే నీటి వరవడి తగ్గి
మందగించిన జనప్రవాహం అడుగున
తేటతేరిన నీటికింద
స్పష్టంగా మెరిసే యిసుకలా బైటపడి
ఎండలో నీటుగా కనిపిస్తున్నాయి రోడ్లు

ఎండకి జడిసి పావురాళ్ళు
గూడుల్లో ముడుచుకుపోయి
పడగ్గదుల్లో ఇల్లాళ్ళు
పరుపులమీద ఒదిగిపోయి
చిన్నబోయాయి భవంతులు

ఆకలి గీతాల్తో ప్రతిధ్వనించి
శబ్దాలు మరీ శృతిమించి
ఇల్లొదిలి రోడ్డునపడి
బడబడవాగుతూ సందడిగా వున్నాయి
డబ్బారేకుల అతుకులబొంత పూరిళ్ళు

ఒళ్ళొంచి పనిచేసే శ్రమజీవుల
కాలే కడుపుల ఆకలి కన్నీళ్ళులా
ఉబికుబికి బైటపడే చెమటలో కరిగి
ఒంటికి వార్నిష్ పూసినట్టు
చిత్రీపట్టి నిగనిగలు పెట్టినట్టు
ఆరుబయట తెల్లని సూర్యుడికింద
ఉదయంనించి ముద్ది ఆన్చక
శ్రమిస్తోన్న కూలిజనానికి
కొత్త అందాలకోటా కొడుతోంది
మధ్యాహ్నపు ఎండ

రంగు పౌడరు కోటా కొట్టుకుని
కారులో షాపింగ్ కి వచ్చిన
చలువ కళ్ళద్దాల పాతికేళ్ళ బేబీకి
కారుకీ షాపుకీ మధ్య
పదిగజాలు నడవడానికి
అడ్డుగా ఎండ వున్నందుకు
నిలువెత్తు చిరాకొచ్చి
చలికాలంకూడా యింత ఎండేమిటని
చడామడా మనసులోనే తిట్టేసింది సూర్యుడ్ని
ముఖానికి పులుముకున్న పౌడరు
చెమటలో కరిగిపోతే
నలుగురి కళ్ళల్లో ఎలా పడేదని
బుంగమూతితో మెలికలు తిరిగిపోయింది

పొద్దున్నే వీధులు పట్టిన ముష్టాళ్లు
రోడ్లనే వ్యాపారకేంద్రాల్ని చేసుకున్న హాకర్లు
గూడులేని బికార్లు
కాళ్ళరిగినట్టు ఎండలో తిరిగితిరిగి
కొద్దిసేపు నీడలో సేదదీరడానికి
నగరంలో సరిపడా చెట్లేలేవు
నిజానికి యిక్కడివి అన్నీ బోడిరోడ్లు
నెత్తిమీద గుప్పెడు జుత్తయినాలేని బోడిగుండ్లరోడ్లు
ఎక్కడో అక్కడక్కడ ఒకటీ అరా కనిపిస్తాయి
ఎవరి పెరట్లోంచో పొడుచుకొచ్చిన చెట్లు

మార్కెట్‌లో టోకు వ్యాపారానికి
మధ్యాహ్నం మంచిసైము
గోడౌన్లూ గల్లాపెట్టెలూ
చూస్తుండగానే నిండుకుని పొర్లిపోతాయ్
కళ్లెదుటే కాళీఅయి దిగాలుపడ్తాయ్
ఆవేళప్పుడు డబ్బు లెక్కెట్టుకోడానికి
చేతికి అయిదేళ్ళూ చాలక
ఆరాటపడి పోతూంటారు షావుకార్లు
ఊరికే అటూయిటూ ఊగిపోతుంటారు
వాళ్ళ దుకాణాల్లో కాటాలుసైతం
క్షణం నిలకడగా వుండవు
న్యాయాన్యాయాలమధ్య ఊగిసలాడి
ఉయ్యాలలు ఊగుతుంటాయ్

టెలిఫోన్ లైన్స్‌కు అవి బిజీ అవర్స్
తీగలనిండా క్షణం తీరికలేకుండా
వ్యాపార బేరాలు, ఉద్యోగ సిఫార్సులు
కాలక్షేపం కబుర్లు, పరామర్శల పలకరింపులు
వాగ్దానాలు, రహస్యంగా హృదయదానాలు

ఇక్కడ ఫోన్ల మీదే లక్షల వ్యాపారం జరుగుతుంది
ఫోన్లతోనే ఉద్యోగం వచ్చి వాల్తుంది
ఓ గదిలో టేబులూ కుర్చీ వుండి
ఆపైన టెలిఫోను ఒకటుంటే చాలు
వేగన్లకొద్దీ సరుకుని
ఫోన్లమీదే కొనెయ్యొచ్చు, అమ్మెయ్యొచ్చు
ఒంటిమీద ఖద్దరు బట్టలుండి
చేతిలో చిన్న పదవివుంటే చాలు
ఎలాంటి ఉద్యోగినైనా
ఫోన్లతోనే అడవులు పట్టించొచ్చు
అడవిమనిషిని నగరానికి ట్రాన్స్ఫర్ చేయించొచ్చు

అయ్యగారు యింట్లోవుండరు కనుక
అమ్మాయిగారితో హృదయాన్ని మార్చుకోవచ్చు
అమ్మగారికి పనేంవుండదు గనుక
అయ్యగారితో ముచ్చట్లు ఆడుకోవచ్చు
అందుకే మధ్యాహ్నంపూట ఫోన్లు
వసపోసిన పిట్టల్లా వాగుతూనే వుంటాయ్
టెలిఫోను తీగలనిండా ఎడతెరిపిలేకుండా
మాటలు ప్రవహిస్తూనే వుంటాయ్

ఆఫీసుల్లో ఫైళ్ళు
తప్పటడుగులు వేసే వేళయ్యింది
నత్త నడకల్తో
మెల్లగా కదలిక మొదలయ్యింది
ఆవేళప్పుడు
ఉద్యోగులకన్నా విజిటర్లే ఎక్కువ
వచ్చే పోయేవాళ్ళతో
మహారద్దీగా వుంటుందక్కడ
సగంమంది అధికార్ల చుట్టూ

మరి సగంమంది ఫైళ్ళచుట్టూ
పడిగాపులుకాస్తూ ప్రదక్షిణలు చేస్తూ
ఫైళ్ళతోపాటు వాళ్ళూ కదుల్తూ
అంచెలంచెలుగా మోక్షం పొందుతూ
అధికార్ల సంతకాలకు అడ్డదార్లు వేస్తుంటారు
పై వాళ్ళతో ఫోన్లమీదఫోన్లు చేయించి
అవసరమైతే ఎక్కడికక్కడ ముడుపులు చెల్లించి
పుచ్చుకోనివాళ్ళకు ఫ్రెండ్లీగా కాఫీ టిఫిన్లు యిప్పించి
అదికూడా వద్దనేవాళ్ళమీద జాలికురిపించి
పనులయ్యేవరకు ఆఫీసులకే అంటుకుపోతుంటారు

ఫేక్టరీలు ఆటవిడుపుతో
ఒళ్లు విరుచుకుంటున్నాయ్
ఆకలి కడుపుల్లో
దాణా వేసుకుంటున్నాయ్
ఉదయంనించి పనిచేసిచేసి అలసిపోయి
తెల్లవారుఝామున తిన్న చల్దన్నం అరిగిపోయి
ఆకలికి పేగులు
అసావేరిలో రాగాలు తీస్తోంటే
సైరన్ కూయడమే తరవాయి
బిలబిలా బైటికొచ్చి
కేరియర్లమీదికి ఎగబడుతున్నారు కార్మికులు
హోటళ్ళను వెతుక్కుంటున్నారు క్లార్కులు
కార్కులు పూడదీసి గ్లాసులు నింపుకుంటున్నారు మేనేజర్లు

ఇంట్లో కోడలుపిల్ల పెత్తనంలో
వంట్లో సత్తువవున్నా లేకున్నా
కాళ్లుముడుచుకుని కూచోడం కుదరక
కూచుంటే సంసారం సాఫీగా సాగక
ఒళ్ళొంచయినా పదిళ్ళకూ తిరిగి

ఉదయం పిల్లల్ని స్కూళ్ళకు తీసుకెళ్ళి
మధ్యాహ్నం అన్నంకేరియర్లు మోసుకెళ్ళి
గేటుబయట బడిగంటకు ఎదురుచూస్తూ
తోటివారితో బాతాఖానీ వేసుకుంటూ
కోడళ్ళ అధికారంలో అనుభవిస్తున్న బాధల్ని
సీరియల్ గా చెప్పుకుంటూ కూచున్నారు
అధికారం చెయిజారిపోయిన ముసలమ్మలు

రోజుకి ఒకసారన్నా
అంగుట్లోకి ఐదేళ్ళూ పోవాలని
కావలసిన కనీసావసరాల్లో
పదోవంతు తీరినా చాలని
అంగడంతా అమ్మినా
ఐదురూపాయలన్నా రాని సరుకుతో
రోడ్డుపక్క గోడవార నీడలో
అంగళ్ళు పెట్టుకున్న బక్కవాళ్ళు
మధ్యాహ్నం అయ్యేసరికి
మీదమీదకి విరుచుకుపడ్తున్న ఎండకి
అలా అలా జరుగుతూ పోతున్నారు
అడపాతడపా అధికారం చెలాయించే పోలీసులకు
వంగి వంగి నమస్కారాలు పెడుతున్నారు

పేరుకు ప్రభుత్వోద్యోగి అయినా
ప్రయివేటు పనులకే అలవాటుపడ్డ జీవి
అధికార్లు చెప్పిన అడ్డమయిన ప్రతిపనీ
కాదనకుండా చేయడమే అతని విధి
అతని పేరు ఏమయితేనేం ఉద్యోగం ప్యూను
ప్రభుత్వ యంత్రాంగంలో అడుగుమెట్టు అతను

పై మెట్టుమీది ఎల్ డి సి సిగరెట్లు తెమ్మన్నా
ఆ పై యు డి సి కరెంటు బిల్లు కట్టి రమ్మన్నా

ఇంకా అవతలి సూపర్నెంటు కాయగూరలు కొనితెమ్మన్నా
కాదనకుండా తలూపి చేయక తప్పదు

ఇంట్లో తనకంచం తాను కడుక్కోకపోయినా
ఆఫీసులోమాత్రం అయ్యగారి కంచం కడగాలి
కిందపడ్డ ఎంగిలి మెతుకుల్ని ఎత్తి పారెయ్యాలి
ఎదురు తిరిగితే ఉద్యోగం ఊగిసలాడకమానదు
'విధి నిర్వహణలో నిర్లక్ష్యం' కారణంతో
మెమోలతో మొట్టికాయలు తినకతప్పదు
అందుకే లంచ్‌కు టైమయ్యిందంటే
పైపన్లతోనే ప్యాన్లకు తీరిక వుండదు
ఆకలివేస్తున్నా అందరి పన్లూ పూర్తిచేసి
ఆ తర్వాతే ఆత్మారాముడి సంగతి చూసుకోకతప్పదు

పచ్చని చెట్లతలలమీద సచివాలయం
ఖద్దరు టోపీలా తెల్లగా మెరుస్తోంది
మంత్రులుసైతం దాటిరాలేని వాగ్దానాల్లా
మూడునిలువుల ఎత్తున నిల్చున్నాయి ముందరిగేట్లు
ఇస్త్రీ మడతలుపోని జరీకండువాలా
ఎండలో మెరిసిపోతోంది
గేటువెనక నీటుగా సిమ్మెంటుబాట
అక్కడ——
గజంగజానికీ అధికారం పాతినట్లు
ఎక్కడబడితే అక్కడ నమస్కారాలుపెట్టే బంట్రోతులు!
అడుగడుగునా ప్రభుత్వం పీఠంవేసుకున్నట్లు
ఎటుచూసినా జీవోలు ఎన్జీవోలు !
తిరుగులేని అధికారాన్ని చాటుతున్నట్లు
సర్రున జారిపోయే కార్లలో మంత్రులు !
వేలాడదీసిన స్వాగతతోరణాల్లా
రెపరెపలాడే ప్రభుత్వ ఉత్తర్వులు !

అందానికి పెట్టిన ఫ్లవర్ వాజుల్లా
టేబుళ్ళమీద ట్రేలునిండా ఫైళ్ళు!

భారీఎత్తున యిక్కడ
ప్రభుత్వ ఉత్తర్వులు ఉత్పత్తి అవుతాయి
రాష్ట్రం నాలుగు చెరగుల్లోకీ
తక్షణం పంపిణీ అవుతాయి

ప్రభుత్వ అధికారానికి యిది ప్రధాన కేంద్రం
అన్ని స్థాయిల్లోనూ యిక్కడ
అధికారం మదించి వుంటుంది
క్లార్కులుసైతం కాలర్లెత్తి మాట్లాడుతారు
కళ్ళను నెత్తిన పెట్టుకొని చూస్తారు
ప్రమోషన్లూ రెండుమూడు అంచెల హైజంప్‌లూ
రానున్న కొత్త ఉద్యోగాలకై లాంగ్ జంప్‌లూ
సర్వీసుల సొంతవిషయాలూ యిక్కడ
ప్రజల సమస్యలకన్నా ప్రధానం
అధికారంతోపాటు స్వార్థం కూడా
ముమ్మూర్తులా మూర్తీభవించడం చూస్తాం

సాయంకాలం జారీ కానున్న జీవోలకు
మధ్యాహ్నమే పురిటినొప్పులు మొదలు
ఇక్కడ మంత్రసానులకేం కొదవలేదు, కొల్లలు
సెక్షన్ కి ఒక ఆఫీసరు, శాఖకి ఒక సెక్రటరీ
ఆ రెండింటికీ మధ్య మరో మూడంచెలు
పైన ఒక చక్రనేమి, మంత్రులు మరి సరేసరి
అందరికీ ముందర ముఖ్యమంత్రి రథసారథి

మధ్యాహ్నంపూట యిక్కడ హడావుడి ఎక్కువ
బైటివాళ్ళతో మహారద్దీగా వుంటుందిక్కడ
ఎలక్షన్లో తప్పిపోయిన మంత్రుల్ని

వెతుక్కుంటూ వచ్చిన వూరివాళ్ళు—
కంట్రోలు సరుకులా కరువై పోయిన ఉద్యోగాలకై
అమాయకంగా ఆశపడి ఎగబాకే నిరుద్యోగులు—
మూడేళ్ళుగా మోక్షంలేక మూలుగుతోన్న
బూజుపట్టిన ప్రమోషన్లని బైటికితీయించి
పెన్షన్‌కై ఎదురుచూస్తోన్న ఉద్యోగులు—

కట్టినవంతెన్లు కొట్టుకుపోయినా
డబ్బింకా చేతికిరాక, ఫైనాన్స్‌లో సేంక్షన్‌కాక
క్రమంతప్పక రోజూహాజరువేసుకొనే కంట్రాక్టర్లు—
రానున్న రకరకాల ఎన్నికల్లో ఏదోఒకదాన్లో
చిన్నదో పెద్దదో పదవిచ్చి
నాలుగురాళ్ళు ఏరుకొనేందుకు దారిచ్చి
కాస్తోకూస్తో దేశసేవకు పచ్చజండాచూపించి
పుణ్యం పురుషార్థం కల్పించమని
అవకాశం యిప్పించమని
మంత్రుల్ని కోరడానికి
మంతనాలాడ్డానికి
ప్రజల ఖర్చుతో పరుగెత్తుకొచ్చిన వినాయకులు—
కమీషన్లమీద పన్లుచేసే దళార్లు—
ఋణాలమీద కోరికలుతీర్చే బ్రోకర్లు—
ఆశ్రితులు, అవకాశవాదులు, అవినీతి ప్రచారకులు
అక్కడ రకరకాల తిరునాళ్ళ ప్రజలు !

హోటళ్ళూ కేంటీనులకు
ఒకటీరెండు మధ్య రష్ ఎక్కువ
కనీసం కప్పుకాఫీయో, టీయో పడకపోతే
లెక్చరర్ చెప్పేదేమిటో
ససేమిరా అర్థంకాదు విద్యార్థులకు
కనీసం అంగుళం మేరయినా

కలం కదలదు వైట్ కాలర్లకు
కొందరికి అలవాటు తీరదు
మరికొందరికి కాలం గడవదు
సగానికి సగం మందికి దినచర్య పూర్తవ్వదు

హోటళ్ళలో సర్వేశ్వర్రావులకు
చీవాట్లతోనే కడుపు నిండిపోతోంది
కదలడానిక్కూడా సందులేని జనంమధ్య
భరతనాట్యం చేసి చేసి
ఒళ్ళుసైతం అలసిపోతోంది
అర్ధగంటలో మీదపడ్డ అక్షింతల్ని పోగేస్తే
వారం రోజులు మరిక భోజనం అక్కర్లేదు
అయిదేళ్ళ వీధిబడి చదువులో సైతం
అయ్యవార్లన్నా అన్ని అక్షింతల్ని వేయలేదు

జనం తాకిడికి తట్టుకోలేక
గిలగిల్లాడిపోతున్నారు సర్వర్లు
ఉన్న చిల్లర సరిపోక
హడావుడి పడుతున్నారు కేషియర్లు

ఒకచోట——
ఈ రోజు పుటప్‌చెయ్యమన్న కరెంట్‌ని
మూణ్ణెల్లకిగాని తీయని ఎన్జీవో అన్న
అడిగినకాఫీ అరనిమిషం ఆలస్యంగా తెచ్చినందుకు
సర్వర్‌ని చెడామడా తిడ్తున్నాడు
మరోచోట——
మధ్యాహ్నం క్లాసులకు ఎగనామంపెట్టి
మేట్నీకి ప్రోగ్రాం వేసుకున్న కాలేజీతంబి
చెప్పిన పెసరట్టు సరిగా కాలలేదని
దానికి సర్వర్‌దే పూర్తిగా తప్పని
గొంతు చించుకుని అరుస్తున్నాడు

మధ్యాహ్నంపూట ప్రతిమనిషికీ చిరాకెక్కువ
అధికారాన్ని ప్రదర్శించుకోవడమే ప్రతివాడికీ మక్కువ
కిందవాడిమీద
ఒదిగి తలవంచే వాడిమీద
నోట్లో నాలిక లేనివాడిమీద
జేబుల్లో రూకల్లేని వాడిమీద
దిక్కులుచూసే వాడిమీద
బిక్కమొహం వేసేవాడిమీద
అధికారం చెలాయించడం
ఈ నాడు అంతటా సర్వసాధారణం
ఈ ధోరణి పూర్తిగా మారి
సంస్కారం మనిషికి అబ్బేవరకు
సర్వర్లూ సన్నకార్లూ
అభిమానాన్ని పూర్తిగా చంపుకుని
తిట్లను దీవెనల్లా తీసుకోక తప్పదు
దుమ్ములా వాటిని దులిపేసుకోక తప్పదు

నగరంలో ఎండింకా విరగపూస్తూనేవుంది
రోడ్లమీద మెరుపులు కురిపిస్తూనేవుంది
ఉదయం జరిగిన ఏక్సిడెంట్ లో
పగిలిన గాజు పెంకులు
రోడ్డంతా చెదిరి
వెలుగు పల్లేరుకాయల్ని
చుట్టూ వెదజల్లినట్టుంది

ఆకాశంలో అధికారానికి కేంద్రంగా
వెలిగిపోతున్న సూర్యుడి కిందుగా
తిరుగుతోన్న ప్రభుత్వయంత్రాంగం నిరంతరంగా
ఉత్పత్తి చేసే ఉత్తర్వులతో
వెదజల్లే ఆజ్ఞలతో

బలవంతుల శాసింపులతో
వాళ్ళు చేసే బలప్రదర్శనలతో
అధికార్ల ఆధిక్యతతో
అడుగువారిమీద జులుంప్రదర్శనలతో
ఉన్నవాళ్ళ హుంకారాలతో
ఊడిగం చేసేవాళ్ళమీద గద్దింపులతో
అడుగడుగునా మధ్యాహ్నంపూట
అధికారం తొంగిచూస్తుంటుంది
ఆధిక్యత కనిపిస్తుంటుంది
అందుకే
నగరంలో మధ్యాహ్నం
అధికారానికి సంకేతం



# సాయంత్రం

నీడ

పొడుగ్గా సాగిసాగి
రోడ్డును కత్తిరించి
ఫుట్‌పాత్‌మీద మట్టితవ్విన గుంటలో
మన్నుతిన్న పాములా ముడుచుకుపోయి
నిద్రపోతోన్న ఎలక్ట్రిక్ పోలు
నీడ

సిగ్గుసిగ్గుగా
కొత్తపెళ్ళి కూతురిలా
దొంగచాటుగా
అద్దాల షోకేసుల్లోకి తొంగిచూసి
తనలోతనే మురిసిపోతోన్న
రెండంతస్తుల మేడ
నీడ

మనసులో
మూడుగంటలక్రితం మొలకెత్తిన కోరిక
నీరులేక ఎండి మోడై
ఇప్పుడు ఎర్రని యవ్వనంబ్రిగాండు ముందు

సిల్హౌటీలా దట్టమయిన
కాటుక కొమ్మల చెట్టు
నీడ

దుమ్ముకొట్టిన జనం పాదాలకింద పడి నలిగి
సాగి సాగి
పొడుగ్గా రోడ్డు రెండోఅంచువరకూ సాగి
దుమ్ములో పడిలేస్తూ
వెన్నంటుతోన్న డబుల్ డెక్కర్
నీడ

నగరంనిండా ఎటుచూసినా
గజిబిజిగా అల్లుకుపోయి
చూస్తుండగనే అడవితుప్పల్లా
పిచ్చిగా ఎదిగిపోతోన్న నీడలు
అవి సాయంకాలపు గుర్తులు
మధ్యాహ్నానికీ సాయంకాలానికీ
సరిహద్దుగట్టున నాటిన బ్రహ్మజెముళ్ళు

పక్కానికొచ్చిన ఎండలో నగరం
పసుపు రాసుకున్న పల్లెటూరిపిల్లలా వుంది
నొసట దిద్దుకున్న కుంకుమ బొట్టులా
ఆకాశంలో ఎర్రగా వెలిగిపోతున్నాడు సూర్యుడు

వికసించిన యవ్వనంలో
ఎత్తుపల్లాలు బైటపడి
పరచుకున్న వెలుగునీడలు
చూపులకు అడ్డుపడి
వయసులోవున్న పిల్లలా
వయ్యారాలు పోతోంది నగరం

ప్రియురాలి కౌగిలిలా
గోరువెచ్చగా
మనసుకు గిలిగింతలు పెడుతూ
మృదువుగా
అనురాగపు జల్లులా
హాయిగా
ఎడతెరిపిలేకుండా
రాలుతోంది సాయంకాలపు ఎండ

మధ్యాహ్నంవేళ మీదవిరుచుకు పడి
గయ్యాళి పెళ్ళాంలా చిరబురలాడిన ఎండ
సాయంకాలం రోడ్డవార నిలిచి
కన్ను గీటుతోన్న కన్నెపిల్ల !
ఇళ్ళవెనక చెట్లవెనక
ముళ్ళతుప్పల్లా అల్లుకున్న నీడలవెనక
దాగుడుమూతలాడుతోంది ఎండ

మధ్యాహ్నం రాసుకున్న పౌడరు
చెమటకి కరిగి
అసలు రూపం బైటపడ్డట్టు
నీలం రంగుగా మారిన ఆకాశాన్ని చూసి
ఎడముఖం పెట్టిన సూర్యుడు
నగరానికి దగ్గరగా జరుగుతున్నాడు
నడక వేగాన్నిసైతం పెంచ్చించాడు

పగటిపూట వొళ్ళు మరచి నిద్రపోయి
రాత్రివేళ వొళ్ళుఅమ్మి నిద్రపోక
సాయంత్రం
అందాన్ని గుమ్మంలో వేలాడేసే వేశ్య - గాలి
ఎందున్నంతసేపూ ఎక్కడో ముసుగుతన్ని పడుకుని

ఇప్పుడిప్పుడే వీధుల్లో విహారానికొచ్చి
ముసిముసినవ్వుల్తో వయ్యారాలు పోతోంది

ఇక్కడ నగరకార్నివాల్ లో
అప్పుడే ఆర్భాటం ఆరంభమైంది
రకరకాల ఆకర్షణలపురివిప్పుకుని
అందం రాక్ ఎన్ రోలు నృత్యం చేస్తోంది

రబ్బరుబంతుల్లా గెంతుకుంటూ
రోడ్లను దాటుకుంటూ
ఇంటిముఖంపట్టి హుషారుగా పోతున్నారు
స్కూళ్ళనుండి బిలబిలా బైటికొచ్చిన బడిపిల్లలు

కొందరు రసగుల్లాలు
మరికొందరు గులాబ్ జామ్‌లు
సంతోషం పంచదార పాకంలో
నిలువెల్లా మునిగి
కార్ల పింగాణీ ప్లేట్లలో
ఒద్దికగా ఒదిగిపోతున్నారు వారు
మిగిలినవారు మిక్చర్ పొట్లాలు
అంటుకున్న ఆకలికారంతో గెంతుకుంటూ
తిన్నగా పొట్లాల్లో నిలవక జారిపడి
రోడ్డంతా చిందరవందరగా తుళ్ళుతున్నారు

విద్యకు ఆలయాలైన కాలేజీల్ని
పగలు రాజకీయాలకూ అరాచకీయాలకూ
నిలయాల్ని చేసిన రాజకీయనాయకులు
తమ కీర్తిసౌధాలకు వాడుకున్న పునాదిరాళ్ళు-విద్యార్థులు
తమ స్వప్రయోజనానికి అవసరమైతే
ఎలాటిపనికైనా వెనుదీయని స్వార్థపరుల చేతుల్లో
వారు నిలువుగోతిలో దిగబడి పోయిన వాళ్ళు

నిజానికి విద్యార్థుల్లో సగానికిసగంమంది మినీతారలు
వాళ్ళకు కాలేజీలు అందమైన సినీ స్టూడియోలు

రాత్రిపూటకూడా కాలేజీల్ని తెరిచి వుంచితే
రంకులకూ, రాసక్రీడలకూ తావులు చేయకమానరని
అధికార్లు జడిసి
నాలుగు దాటడంతోనే గేట్లు మూయిస్తున్నారు
డ్యూయెట్లకు పబ్లిక్ రోడ్లున్నాయని
బలవంతంగా రోడ్లు పట్టిస్తున్నారు

పగలంతా ఆఫీసుల్లో గిరగిరా తిరిగి
సాయంకాలం గాడిదాటి బైటపడినా
ఆలోచన్లు మాత్రం యింకా ఆఫీసుల్ని వొదలక
ఫైళ్ళనీ, ప్రమోషన్లనీ
జీవోలనీ, యువోలనీ
రోడ్లమ్మట చర్చించుకుంటూ
సజీవ మానవయంత్రాల్లా సాగిపోతున్నారు
ఇద్దరూ ముగ్గురూ జట్లుజట్లుగా
పరిపాలనా యంత్రాంగంలో మరలు ప్రభుత్వోద్యోగులు

ఒకానొక బలహీన క్షణంలో, సంతోషంలో
భార్యకు వాగ్దానం చేసిన ఫుల్‌వాయిల్ చీరని
మూడు నెలలపైన మరిమూడురోజులు గడిచినా
దానంచేసిన మాటని నెరవేర్చలేక
ప్రతిరోజూ ఆవిడ మూతి ముడుచుకుంటున్నా
ముల్లులా ఆ సంగతి మనసుకు గుచ్చుకుంటున్నా
మహామహా మంత్రులే ఆడినమాట తప్పుతున్నారని
మళ్ళీ ఎన్నికలొచ్చేవరకు కన్వీనియంట్‌గా మర్చిపోతుంటారని
అన్నదాన్లో అయిదుశాతమన్నా అమలుపర్చరని
మరోదారి లేక మనసుతో రాజీపడి

ఐనా ఫస్ట్‌కి తప్పక కొనిద్దామని
మనస్ఫూర్తిగా నిర్ణయించుకున్న గుమస్తా
అందాకా అల్పసంతోషి అర్ధాంగిని మురిపించడానికి
పదిపైసల పూలు కొనుక్కొని
కూనిరాగం తీసుకుంటూ
ఖుషీగా నడుస్తున్నాడు
ఆ రోజుకి మరిక ఫరవాలేదని
ధైర్యంగా అడుగులు వేస్తున్నాడు

మధ్యతరగతి జీవులు గుమస్తాలు
ఇంచుమించు అందరివీ ఒకేరకం సమస్యలు
అందుకే ఆ వేళప్పుడు పూలకై
ఎక్కువగా వాళ్ళే ఎగబడుతుంటారు
కార్లున్న బాబులకూ, మేడల్లో మారాజులకూ
అంగట్లోకొచ్చి పూలు కొనాల్సిన అవసరంలేదు
వాళ్ళకు పెద్దవో చిన్నవో మేడలుంటాయ్
ఆ చుట్టూ కాస్తోకూస్తో పెరడులుంటాయ్
అందులో మేడల అందాల్ని పెంచడానికి
రకరకాల పూలమొక్కలు తప్పక వుండుంటాయ్
అవే ఆయింటి ఆడాళ్ళ అందానికి
ఇంకాస్త మెరుగులు పెడుతుంటాయ్

ఒంట్లో సత్తువనే పెట్టుబడిగా పెట్టుకుని
పగలల్లా రెక్కల్ని ముక్కలు చేసుకుని
కష్టపడి పనిచేసిన రోజువారీ కూలీలు
ఇప్పుడిప్పుడే పనుల్లోంచి దిగి
ఇంట్లో పిల్లల్ని, వాళ్ళ కాలీ కడుపుల్ని
వెళ్తేగాని రాజుకోని పొయ్యిల్ని, వాటిలోంచి లేవని పిల్లుల్ని
పొయ్యిమీదికి కొనాల్సిన రొయ్యల్ని, కాదంటే ఉల్లిపాయల్ని
ఆలోచనల్లో నింపుకుని

ఎప్పుడెప్పుడు చేతిలో డబ్బులు పడ్తాయా అని
ఒళ్ళెల్లా కళ్ళుచేసుకుని
కళ్ళల్లో ఆతృత నింపుకుని
మేస్త్రీల చుట్టూ మూగుతున్నారు

చీకటితోనే గూళ్లువదిలి
కడుపు నింపుకోడానికి వున్నవూరు వదిలి
పక్కగ్రామాలకు ప్రవాసంపోయిన పక్షులు
పడ్డకష్టానికి ఫలం దక్కించుకుని
తృప్తినిండిన రెక్కల్ని ఉత్సాహంగా ఊపుకుంటూ
సమైక్యత, సమిష్టి జీవితాల్ని చాటుకుంటూ
దారుల్లేని ఆకాశంలో బారులుతీర్చి
కలిసికట్టుగా ఎగురుతూవచ్చి
గూళ్ళను చేరుకుంటున్నాయ్
తెచ్చిన బుక్కెడు గింజల్ని పిల్లల నోటికిచ్చి
సందడిగా కేరింతాలు కొడుతూ ఆడుకుంటున్నాయ్

ఇళ్ళకన్న రోడ్లే పదిలం కష్టజీవులకు
సమస్యల పిచ్చిమొక్కలు పెరిగిన బీళ్లు—యిళ్ళు
పిల్లల తీరని కోరికల గగ్గోళ్ళు—ముళ్ళు
ఇల్లాళ్ళ అసంతృప్తి చూపులు—పల్లేర్లు
మొత్తం యిళ్ళే చిన్నచిన్న బంజరుబీళ్ళు
అయినా అక్కడ ఆరోగ్యవంతమైన అభిమానపుగాలి వీస్తుంది
మనసుకు గిలిగింతలు పెడుతూ మురిపిస్తుంది
అందుకే
రోడ్లమీద ఆకర్షణల క్రోటన్స్‌లను దాటుకుని
దుకాణాల్లో రంగురంగుల పలకరింపుల్ని నెట్టుకుని
ఇళ్లకు హడావుడిగా పోతున్నారు వారు

విరగపూసిన పూలచెట్లలా
కలకల్లాడుతున్నాయ్ బస్టాపులు

సౌందర్య సువాసనలు గాలిలో కరిగి
ఘుమఘుమలు పోతున్నాయవి
ఆ చుట్టూ పల్లీలు కొడుతున్నాయ్
అందంతో మత్తెక్కిన తుమ్మెదలు
సంతోషంతో కూనిరాగాలు తీస్తున్నట్టు
ఎవరి చంకల్లోనో పాడుతున్నాయ్ ట్రాన్సిస్టర్లు
ఒకవిధంగా సాయంత్రంపూట
సౌందర్య నిలయాలు బస్టాపులు

దుకాణాలే రోడ్లమీదికి నడిచి వచ్చినట్టు
ఫుట్‌పాత్‌లను ఆక్రమించుకుని
పాదచారులకు దారులుమూసి
కాళ్లకు పగ్గాలువేసి పక్కకులాగి
కళ్లకు అడ్డంపడి దిగ్బంధనంచేసి
అందాన్ని బట్టవిప్పి చూపుతున్నాయ్
అప్పటికప్పుడే పుట్టుకొచ్చిన టెంపరరీ దుకాణాలు

అక్కడ కొనేవాళ్లు తక్కువ, అడిగేవాళ్లు ఎక్కువ
ముప్పాతిక మూడొంతులమందికి
సరదాగా బేరం చెయ్యడం ఒక హాబీ
చెప్పినధరకు సగానికి సగంకన్న తక్కువకు
అడిగి లేదనిపించుకుని వెళ్లిపోవడం
వాళ్లకు అదోరకమైన హాపీ

రోడ్డెక్కిన సరుకు ప్రతీదీ
చవకబారుదనే అభిప్రాయం వాళ్ళది
షోకేసుల్లో చూపిస్తేగాని
విలువైనదని ఒప్పుకోని మనస్తత్వం జనానిది
రోడ్డుమీది అద్దాన్నైనా, ఆడదాన్నైనా
మరీ చవకగా బేరాలు ఆడుతుంటారు
అద్దాలగదుల్లో అమర్చితేమాత్రం

మరోమాటలేక అడిగినంతా చెల్లిస్తుంటారు
అందుకే ఫుట్‌పాత్ దుకాణాల్లో
అమ్మకం తక్కువ, బేరంఎక్కువ

పొద్దుటేళ నగరంలో జనానికి
బజారుచేసే తీరుబాటు బహుతక్కువ
తెగేవరకూ సాగదీసి బేరంఆడ్డానికి
సాయంత్రం ఒక్కటే సరైనసమయము వారికి
ఉదయంపూట ఊపిరి పీల్చుకోడానికైనా తీరిక వుండదు
సాయంకాలానికి పైపన్లను వాయిదావేయక తప్పదు
హడావుడిలో పుచ్చువంకాయలు తెచ్చినా
పదిపైసలు ఎక్కువకు బేరంచేసినా
ఇంటావిడ పదిసార్లన్నా దెప్పకమానదు
అందుకని అరగంట ఆలస్యమైనా
తీరిగ్గా సాయంకాలమే బజారు చేస్తుంటారు
తాపీగా కావలసినవి కొంటుంటారు
కనుకనే సాయంకాలం కూరగాయల మార్కెట్టు
నగరంలో బిజీగావుండే చోటు

రోజల్లా యిళ్ళల్లో ముక్కిపోయిన ఆడాళ్ళు
అగ్గిపెట్టెలాంటి అరల్లోంచి బైటపడి
విశాలమైన ఆకాశంకిందికొచ్చి
స్వేచ్ఛగా గాలి పీల్చుకుందామని
చెమటకంపూ ముక్కవాసనా అంటకుండా
ఆలోచనల్ని వెలుతుర్లో ఆరేద్దామని
బజార్లో షాపింగ్ పేరుతో
సంచులు ఊపుకుంటూ బయలుదేరుతున్నారు
కొందరు ద్వారబంధాలకి చూపులతోరణాల్ని
నిరీక్షణలదారంతో కలిపికట్టి వేలాడేసి
భర్తలకై ఎదురుచూస్తూ నుంచున్నారు

మరికొందరు అందంగా సింగారించుకుని
భర్తలురాగానే ఆకర్షణలవలలు విసిరి
కోరికల చేపల్ని చేజిక్కించుకుందామని
ఒంటరిగా అద్దంముందు రిహార్సల్సు వేస్తున్నారు
మరికొందరు టిఫిన్లతో తమవైపు తిప్పుకుందామని
వంటిళ్ళల్లో అపసోపాలు పడుతున్నారు
ఇంకొందరు చెప్పినపని చేయడం మర్చిపోయి
అడిగినప్పుడు తడుముకోకుండా చెప్పడానికి
అబద్ధాల్ని వల్లెవేస్తున్నారు

పొద్దుటినించీ పిల్లలు
టీచర్ల అదమాయింపుల బెత్తాలకింద
భయం బెంచీలమీద కూచుని
కుందేలుపిల్లల్లా అదిరిపడ్తూ గడిపినవారు
ఇళ్ళుచేరగానే స్వాతంత్ర్యంవచ్చి
అరుగులమీద ఆనందాలరాసుల్ని పోసుకుని
వీధుల్లోకసైతం వాటిని వెదజల్లుతూ
ఆడుతూ పాడుతూ
కేరింతాలు కొడుతూ
ప్రతి యింటినీ ఆనందనిలయాన్ని చేస్తున్నారు
ఆకలి కడుపులవాళ్ళు, కాళీ జేబులవాళ్ళు
అలిగినా కోరికలు తీరనివాళ్ళు
అడిగినా ఎవరూ పెట్టనివాళ్ళు
అందరూ సంతోషంతో తుళ్ళుతున్నారు
సాయంకాలాన్ని సుందరంగా తీర్చి దిద్దుతున్నారు

మురికి ఆలోచనల యిరుకు మనసుల పెద్దాళ్ళు
విసిరిన హెచ్చరికల పల్లేరుకాయల్ని సైతం లెక్కచేయక
అడ్డుగా కట్టిన కులమతాల కంచెల్ని దాటుకుని
సమత్వం లాన్‌లలో గెంతుకుంటూ

స్నేహాలతలు పెనవేసుకున్న ఆర్చీల్లోంచి దూరి పరిగెడ్తూ
అంతరాల్ని మరిచి ఆడుకుంటున్న పిల్లల్తో
పురపాలక సంఘం పార్కులు
హౌసింగ్ కాలనీల ఆటస్థలాలు
కలకల లాడుతున్నాయ్, సమతను చాటుతున్నాయ్

నిజానికి పిల్లల ఆట స్థలాలు
పెద్దవాళ్ళకు పాఠశాలలు
వయసుతోపాటు మర్చిపోయిన విషయాలుకొన్ని
అక్కడచూసి మళ్ళీ నేర్చుకోవాలి పెద్దాళ్ళు

చేతిలోంచి వయసు జారిపోయిన ముసలాళ్ళు
ఉద్యోగంనుంచి రిటైరై పోయాక
చేయడానికి యింట్లో పనేంలేక
ఇరవై నాలుగ్గంటలూ ముడుచుక్కూచుంటే
ఇంట్లోవాళ్ళే భరించలేక విసుక్కుంటారని
కాళ్ళను సాగదీసుకుందామని
అనుక్షణం గుర్తుకొచ్చే చేతకానితనాన్ని
కొద్దిసేపైనా మర్చిపోదామని
చాదస్తపు ఆలోచన్లనుంచి
తమనితాము తప్పించుకుందామని
రోడ్లమీది కొచ్చి
ఫర్లాంగు దూరం నడిచేసరికే ఆయాసం వచ్చి
పాతరోజులు వెంటనే గుర్తుకొచ్చి
కలల్ని నెమరేసుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ
దగ్గర్లోని పార్కుల్ని చేరుకుంటున్నారు
కాకుంటే ట్రాఫిక్ ఐలండ్‌లలో కూలబడుతున్నారు
రహదారి జనాన్ని, వాళ్ళ వేషాల్ని
మారిన కాలాన్ని, దాని రూపాల్ని
ఆసక్తిగా చూస్తూ కాలక్షేపం చేస్తున్నారు

ఉద్యోగాన్వేషణలో నిరుద్యోగులు
ఉదయంనించి తిరిగి తిరిగి
కాళ్ళకున్న చెప్పులు అరిగి చిరిగి
సాయంత్రానికి
ఒంటి మీద దుమ్మూ, వొంట్లో నీరసం మిగిలి
కరిగిపోయిన రక్తమాంసాలతో పాటు
ఆనందోత్సాహాలు, ఆశలు
ఆఖరికి కోరికలుసైతం నీరుగారి
ఇంట్లోవాళ్ళకు వెల్తురులో ముఖం చూపలేక
అక్కడ ఆకలిగీసే చిత్రాల్ని చూడలేక
చీకటి కురిసే వరకు
రోడ్లనే నిలయాల్ని చేసుకుని
జారిపోతున్న మిత్రుల్ని వెతుక్కుంటున్నారు
ఓదార్పు మాటల్ని ఏరుకుంటున్నారు

ఒంటరి బ్రహ్మచారులు సాయంకాలాల
గుహల్లాంటి రూముల్లో
ఏకాంతపు వల్మీకాల్లో
తపస్సు చేసుకొనే విరాగులుకారు
అందాన్ని అభిమానించి
ఆరాధించి ఆనందించి
ఒకొక్కప్పుడు
ఆస్వాదించి తరించే భోగులు వారు

ఒంటరిగా గదిలో కూచుంటే
తుంటరి ఆలోచన్లచీమలు
నిర్దాక్షిణ్యంగా తూట్లుపొడుస్తాయని
అందాలు పరచుకొనే నగరం సెంటర్లోకి
రద్దీదారుల్లోకి రోడ్లకూడళ్లలోకి
పెళ్లికొడుకుల్లా తరలివస్తున్నారు

నిలువుకొలువు సేవలు చేస్తున్నారు
అప్పుడప్పుడు అటూఇటూ అక్కడేతిరిగి
అమ్మాయిల భుజాల్లో పైటకొంగుల్లో రాసుకుని
నిద్ర తేలిపోయిన చలిరాత్రిళ్లు
వెచ్చగా వాటిని చదువుకుందామని
మనసు డైరీల్లో భద్రంగా దాచుకుంటున్నారు

విద్యార్థులకు విద్యాలయాలకన్న
కాఫ్యాలయాలంటే ఎక్కువమోజు
పాఠాల్ని హోటళ్లలో చెప్పిస్తే
పాసయ్యేవాళ్ళ పర్సంటేజ్ రెట్టింపు డెఫినిట్

విద్యార్థుల రాజకీయ చర్చలకు
అసెంబ్లీ హాళ్ళు—కాఫీహోటళ్ళు
ప్రతిరోజూ సాయంకాలాల్లో అక్కడ
అనేక విషయాలమీద
అర్థమైన అంశాలమీద
సుదీర్ఘమైన చర్చలు జరుగుతుంటాయ్
క్లాసుల్లో అమ్మాయిలు మొదలుకొని
నగరంలో సినిమాలవరకు
కాలేజీ రాజకీయాలు మొదలుకొని
దేశంలో సమస్యలవరకు
గుర్తొచ్చిన ప్రతివిషయంమీదా
గంటలతరబడి చర్చలు సాగుతుంటాయ్

నగరంలో సాయంకాలం
పెళ్ళివారింట్లోలా ఒకటే సందడి
ఆ వేళప్పుడు
అత్తర్లు, పౌడర్లు, పూల సువాసనలు
రోడ్లమీద పొర్లిపోతుంటాయ్

నలగనిచీరల నాజూకు రెపరెపలు
మడతలుపోని షేంటుల గరగరలు
గాలిని పెనవేసుకుని
రోడ్ల పొడుగునా పచార్లుచేస్తాయ్
చీకటి అరల్లోంచి, చెరసాలల్లోంచి
విముక్తిచెంది వెల్తురులోకొచ్చిన నగలు
సంతోషం పట్టలేక ఎగిరిగంతేసి
వెలుగుకిరణాల్ని అన్నివైపులా వెదజల్లుతూ
రంగురంగుల యింద్రధనుస్సుల్ని వెలిగిస్తాయ్
ముచ్చటగా వీథుల్లోకి వచ్చిన జంటలు
చిరునవ్వుల మువ్వల గలగలల్తో
బాజాభజంత్రీల బేండు సంగీతాన్ని
ఆర్భాటంగా వినిపిస్తుంటాయ్
ఎటుచూసినా పెళ్ళికళకళలు !
అన్నివైపులా సంతోషం కలకలలు ! !

నగరంలో సాయంకాల విహారం
నయాపైస ఖర్చులేని చక్కని కాలక్షేపం
పెళ్ళింకా పాతబడనివారు
పిల్లల బాదరబందీ లేనివారు
ఇంటిపనులు తాకనివారు
ఇంట్లో పెద్దదిక్కు వున్నవారు
వీథుల్లో విహారానికొచ్చి
గమ్యంలేని నడకతో నగరాన్ని చుట్టి
చిరుగాలి తెరలలో సన్నగా వణుకుతూ
రహస్యంగా ఒకరినొకరు తాకుకుని వెచ్చగా నడుస్తూ
రాత్రి జీవితంలో తురుముకోడానికి
అనుభవాల పూలను ఏరుకుంటున్నారు

తాలూకా గ్రామానికి మంత్రిగారు వచ్చినా
జిల్లా టౌనులోకి ముఖ్యమంత్రి వెళ్ళినా
పాతరోడ్లకు కొత్తకళ వచ్చినట్టు
ఆవేళప్పుడు బజారు రోడ్లన్నీ
జరీమెరుపులు మెరుస్తుంటాయ్
వసంతం జల్లుకున్నట్టు
టెక్నికలర్ అందాలు వొలికిస్తుంటాయ్
ఎండసైతం అక్కడ
ఎర్రతివాచీ పరచినట్టుంటుంది
ధూళిసైతం అప్పుడు
చెమ్కీలా మెరుస్తుంది

అందంవున్నా లేకపోయినా ఆడాళ్ళు
రంగురంగుల సీతాకోక చిలుకల్లా
పవిట రెక్కల్ని గాలిలో ఎగరేసుకుంటూ
హొయలు వొలికిస్తూ సోయగాలు పోతున్నారు
చేవవున్నా లేకపోయినా మగాళ్ళు
మదించిన గండు తుమ్మెదల్లా
నిగనిగలాడే నల్లనిమీసాల్ని ఆడించుకుంటూ
ఠీవిని ప్రకటిస్తూ ఛాతీ విరుచుకుంటున్నారు
విలాసంగా వీధుల్లోకొచ్చిన ఆడాళ్ళూ మొగాళ్ళూ
నగరాన్ని ముచ్చటైన వనంలా మారుస్తున్నారు

వాతావరణం చలిచలిగా గోరువెచ్చగా
పులుపూ తీపీ కలిసిన ద్రాక్షపండులా వుంది
వయసులో వున్నవాళ్ళకది
తియ్యగా మనసుకు గిలిగింతలుపెట్టే అందినపండు
ఉడుకురక్తం చల్లారిపోయిన ముసలాళ్ళకు
పుల్లగా నరాల్ని జివ్వున లాగిపించే అందనిపండు

రోడ్లనిండా చీమలపుట్టల్లా నిండిపోయిన జనం
కంగారుకీ ఆతృతకీ దూరంగా
అడుగుల్లో అడుగులు వేసుకుంటూ తాపీగా
దిక్కులు చూసుకుంటూ మెల్లగా
ఆర్భాటంలేకుండా, హడావుడి పడకుండా
నగరం అన్నివైపులకీ కదుల్తున్నారు
షికారుకి వచ్చినట్టు నడుస్తున్నారు

ఉదయంలా రోడ్లన్నీ జనంతో తుళ్ళుతున్నా
అప్పటి తొందరలేదు తోసుకుపోవడం లేదు
పొద్దుట అసహ్యంగా సాగదీసుకుని పరుగెత్తిన కాళ్ళు
ఇప్పుడు నిలిచినిలిచి హుందాగా కదుల్తున్నాయ్
కంగారే పెట్రోలుగా పోసుకుని కదిలినకార్లు
విలాసంగా ఊగుకుంటూ తాపీగా జారుతున్నాయ్

ఆకాశంలో బంగారపు ముద్దలా
పసుపురంగులో మెరిసిపోతున్న సూర్యుడు
విరిసిన ముద్దబంతిపువ్వులా వున్నాడు
అందాల ఫ్లవర్ వాజు మేడలో
అప్పుడే కోసి గుచ్చిన
ఒంటరి పువ్వులా కనిపిస్తున్నాడు

కడుపులో నీళ్ళు కదలక
తిన్న నూకలు అరగక
బద్ధకంతో ఒళ్ళంతా బిగుసుకుపోయి
రెక్కలు ముడుచుకుపోయిన పావురాళ్ళు
తిన్నతిండి అరగడానికి
నగరంమీద ఆకాశంలో
సాయంకాలపు నీరెండలో
రెక్కల్ని ఆరబెట్టుకుంటూ

గాలిని కోసుకొని సోయగాలుపోతున్నాయ్
ఒకదాన్ని ఒకటి తరుముకుంటూ
వాళ్ళు విరుచుకుని పల్టీలు కొడుతున్నాయ్

లాభాల్ని అందినమేరకు పిండుకోడానికి
అమ్మకాల్ని పెంచుకుందామని వ్యాపార్లు
వెల్తురుండగానే దీపాల్ని
దుకాణాల్లో వెలిగించుకుని
పగటిపూటలేని మెరుపుల్ని
వస్తువులకు అద్దుకుని
కొత్తకొత్త అందాల్ని ఆకర్షణల్ని
రకరకాల రంగుల్ని హంగుల్ని
వ్యాపారానికి ఎరలుగా పరుచుకుంటున్నారు

నగరంలో ఎటు చూసినా
కళ్ళకు పండుగ్గా కదిలే అందాలే
కాళ్ళకు బంధాలువేసే ఆకర్షణలే
రోడ్లూ ఫుట్‌పాత్‌లూ
పార్కులూ మార్కెట్లూ
హోటళ్ళూ సెంటర్లూ
చెట్లూ చేమలూ, ఇళ్ళూ బళ్ళూ
నింగీ నేలా, ధూళీ దూగరా
కనిపించే ప్రతిరూపం
అందాల ముసుగుల్ని వేసుకుని
ఆనందాల వెలుగుల్ని నింపుకుని
ఆకర్షణల ఎరల్ని చుట్టూరా చల్లుకొంటోంది
ప్రలోభాల్లోకి మనసును లాక్కుంటోంది
అందుకే
నగరంలో సాయంత్రం
ఆకర్షణలకు చిహ్నం



# సంధ్య

అధికారం నుంచి
ఆకలి కోరికల నుంచి
ఉడుకెత్తిన రక్తపు పొంగునుంచి
ఊహాల ఉద్వేగపు జలపాతాలనుంచి
ఇంతవరకు తననుతాను బంధించుకుని
ఇప్పుడు తనంతటతనే తాళ్ళను తెంచుకుని
నగరంలో అందాలకు మురిసి
తరలివస్తోన్న సూర్యుడికి స్వాగతం పలుకుతూ
ఎర్రతివాచీ పరచినట్టుంది పడమటి ఆకాశం

తాంబూలం వేసుకుని
దక్షిణ నాయకుడిలా వస్తోన్న సూర్యుడు
తుపుక్కున ఊసినట్టు
కళ్ళేలు కళ్ళేలుగా
నగరంమీద పడుతోంది ఎర్రని ఎండ

ఎత్తయిన మేడల అద్దాలకిటికీల్లోకి
తొంగిచూసి అందాన్ని చూసుకుంటూ
అప్పుడప్పుడు మేఘాల తువ్వాళ్ళతో
నీట్టుగా ముఖాన్ని తుడుచుకుంటూ

హడావుడిగా కదిలివస్తున్నాడు సూర్యుడు
ఆలస్యం చేస్తే
మేడలపైన, డాబాలమీద
అందమైన ప్రకృతిలో మునిగిపోయి
తమనితాము మర్చిపోయి
స్వేచ్ఛగా విహరించే
రంగురంగుల సీతాకోకచిలుకలు
మాయమౌతాయేమోనని సూర్యుడు
తొందర తొందరగా అడుగులు వేస్తున్నాడు

పదిమందీ చూస్తుండగా పబ్లిక్‌గా
రెడ్‌లైట్ వీధుల్లోకి వెళ్ళలేక
జనసంచారం అంతగాలేని శివార్లలో
ఎత్తుగా నిలిచిన మేడల వెనకనించి
ఒత్తుగా అల్లుకున్న చెట్లగుబురుల ఆవలనించి
అటూ యిటూ దొంగచూపులు చూసుకుంటూ
నక్కి నక్కి రహస్యంగా జారుతున్నాడు సూర్యుడు

పై చూపేగాని కింద చూపు లేని
నిత్యజీవితావసర వస్తువుల ధరల్లా
అందేటంత దూరంలోనే వుండి
అందుకోబోతే అందకుండా చెయిజారి
పై పైకి పాకుతూ పోతోంది సంధ్యలో ఎండ

పండిన ఎండలోకి చలి
ఉద్యోగి అందుకునే లంచంలా
అతిరహస్యంగా దొంగలాదూరి
ఎండనంతా ఆక్రమించుకుని
భద్రంగా దాచుకున్న వేడిని
కొల్లగొట్టి దోచుకుంటోంది

అధికారి ఆజ్ఞల్ని పాలించి
అంతవరకు అటెన్షన్‌లోవున్న చెట్లు
అతను వెనక్కు తిరగడంచూసి
అల్లరితో గెంతుతున్నాయ్

చూస్తుండగానే నిజాయితీ పై పూత మాడిపోయి
అసలు బండారం బైటపడిన
నకిలీనాయకుల రోడ్డుగోడ్డు మాటల్లా
మసీదుశిఖరాల యిత్తడి గోళాలమీద
మేడల ఏరియల్ రాగితీగలమీద
చెట్ల చిటారుకొమ్మల ఆకులమీద
ఎగిరేపక్షుల రెక్కలమీద
ఎండపూసిన బంగారపు పూత
కళ్ళముందరే మాడిపోతోంది
చూస్తుండగానే భ్రమ తొలగిపోతోంది

ఆకర్షణలకు లోబడి
వ్యామోహాల్లో పడి
పాలితుల్ని మర్చిపోయిన పాలకుడు
సంధ్యాసమయంలో సూర్యుడు

ప్రతాపం అణగారిపోయి
పలుకుబడి దిగజారిపోయి
వేడీ వెలుగూలేని సూర్యుడంటే
ఏమాత్రం. భయంలేదు శత్రువుకు
ఆకాశంలో అతను వుండగానే
ఆ మూల తూర్పువైపున
ఆకాశానికి అంచులాఉన్న చెట్లవరుస వెనక
అవకాశం గురించి ఎదురుచూస్తూ
కనిపించీ కనిపించక దాగిన చీకటి

బాహాటంగానే బైటికొచ్చి
ఆకాశంమీదకు దూకుతోంది

అడుగున నేలమీద యిళ్ళల్లో
లోపలి గదుల్లో మూలల్లో
గడియారపు చిన్నముల్లు నడకలా
కంటికి కనిపించని కదలికతో
అవసరంలోంచి అలవాటులోకి
పొరపాటులోంచి రొటీన్‌లోకి
విస్తరించిన అవినీతి అల్లికలోని మందగమనంతో మెల్లగా
కంటికి ఆననంత నిమ్మదిగా
ముడుచుకుపోయే పూలరెక్కల కదలికలా రహస్యంగా
రాజకీయ హత్యలవెనక కుట్రలా
బయటకు తెలీనంత గుంభనంగా
క్రమక్రమంగా వెలుతుర్ని ఆవరించి
అంతటా చీకటి అల్లుకుంటోంది

ఎక్కడికక్కడ అడ్డుగోడలతో
స్వేచ్ఛగా కదలడానికి వీల్లేని హద్దులతో
ఇక్కడి మనుషుల్లాగే యిరుగ్గా
మంచి గాలీ వెలుతురూ చొరక
పోపుపెట్టె అరల్లా
ముక్క వాసన గదులతో
చిన్న చిన్న పిచ్చికగూళ్ళు నగరంలో యిళ్ళు
అందుకే యిక్కడ
తొందరగా చీకటి చేరుతుంది
ఆరుబయట గుడ్డివెలుగున్నా
అంతరాంతరాల్లో మాత్రం
చీకటి దట్టంగా కమ్ముకుంటుంది

పాలించినవాడు పట్టించుకోక
విలాసాల్లో మునిగి ముఖం తప్పించేస్తున్నప్పుడు
పక్కదార్లు పట్టిన వాడ్ని సరిదిద్దలేక
చీకటిలో కూరుకు పోతున్నప్పుడు
చూసి చూసి యిళ్ళల్లో గృహిణులు
ఈ ముసిరే చీకట్లను విసిరెయ్యడానికి
తమ చుట్టూ వెలుగుల్ని పరచుకోడానికి
ఎవరికివారే చేతనైన ప్రయత్నంగా
ఎక్కడికక్కడే చిన్నచిన్న దీపాల్ని
ఇళ్ళల్లో వెలిగించి వెలుగుల్ని పరచుకుంటున్నారు

బయట రోడ్లమీద
ఎండంతా తరిగి వెల్తురుమాత్రమే మిగిలి
అదికూడా పల్చబడి కొద్దికొద్దిగా కరిగి
ఆకారాలు మసకబారి రూపాలు చెదిరి
కళ్ళు పొడుచుకు చూస్తేగాని కనిపించక
దగ్గరకొచ్చి నిలిస్తేగాని పోలికలు తెలీక
వెలుక్కీ చీకటికీ మధ్య
తెలుపూ నలుపూ కలిసిన
బూడిదరంగు గుడ్డివెలుగులో
తడుముకుంటూ కదులుతున్నారు జనం

ప్రమాదం ముంచుకొస్తేగాని
తరుణోపాయం ఆలోచించని
చేతులుకాలిన తర్వాత గాని
ఆకుల్ని పట్టుకోని
బద్ధకం మన స్తత్వం
వీధివీధినా జీర్ణించుకుపోయిన పురపాలకసంఘం
అశ్రద్ధగా వదిలేసిన రోడ్లు
చీకటి చిక్కపడితేగాని కళ్ళుతెరవని దీపాలకింద

గోతుల్ని బీటల్ని
చీకటితోనే కప్పుకుని ప్రాణాంతకంగా
ప్రమాదాలకి దారుల్లా
నగరాన్ని మయసభలా మారుస్తున్నాయ్

ఎర్రటి ఎండలో మండి
తగలబడిపోయిన చెట్లనుంచి
నుసినుసిగా చీకటిబూడిద రాలి
మసిబొగ్గుల్లా మిగిలిపోయాయి చెట్లు

మల్లెలూ మొల్లలూ
సన్నజాజులూ చంద్రకాంతలూ
పున్నాగలూ పారిజాతాలూ
అలాటివే మరికొన్ని రకాల పూలు
వెల్తురున్నంతసేపూ సిగ్గుతో ముడుచుకునివుండి
చీకటితెరలు జారడంతోనే రేఖల్ని విప్పుకుని
యవ్వనంతో వొళ్ళు విరుచుకుంటున్నాయ్
విటుల్ని ఆకర్షిస్తూ
రిజాల్లో వీధులుచుట్టి బేరాలు చూసుకునే వేశ్యలా
గాలి కెరటాలమీద యవ్వన పరిమళాల్ని ఊరేగిస్తున్నాయ్
కంచెలు దాటి గోడలు దూకి
వీధుల్లో వయ్యారాలుపోతూ విహరిస్తున్నాయ్

విటుల్ని వేటాడ్డానికి వెలయాళ్ళూ
ప్రియుల్ని కలుసుకోడానికి ప్రేయసిలూ
తరచుగా మాటువేసే చోట్లు
దీపాలతో దేదీప్యమానంగా వెలిగే సినిమాహాళ్ళు
అక్కడ కళ్ళు చెదిరిపోయే దీపాల వెలుగుల్లో
పగిలిన గాజు పెంకులుసైతం ప్రకాశాన్నిస్తాయ్
బజారు బ్రతుకులుసైతం జిగేల్ మంటాయ్

దపాలు ఆరకముందే బేరాలు ఆడుకుని
ఆరిన కాస్సేపటికే బైటికి జారుకుని
జనం పల్చగా వున్న దారుల్ని చూసుకుని
మసక చీకటిలో నీడల్లా
కదిలిపోతున్నాయి జంటలు జంటలు

ఎర్రదీపాల వీధుల్లో
నీలందీపాల గదుల్లో
తెల్లని అగరొత్తుల పొగల్లో
రంగు రంగుల సన్నని తెరల్లో
మసక మసక ఆకారాల్తో
కలల్లో కదిలే రూపాల్లా
కిటికీల టెలివిజన్ సెట్లలోంచి
వ్యాపారప్రకటనలు చేస్తున్నారు
అప్సరసల్లాంటి అమ్మాయిలు
వాళ్ళు ఖరీదైన మేడల్లో చిలకలు

పెంకుటింటి చిలకలు
తెరల్ని తొలగించుకుని
తలల్ని బైటికి పొడుచుకొని
కిచకిచ లాడుతున్నాయ్
అప్పుడప్పుడు అరుగులమీద వాలి
దారినపొయ్యేవాళ్ళని పలకరించి పిలుస్తున్నాయ్

పంజరంలో చిలకలకుసైతం
ఆ కొద్దిసేపూ స్వేచ్ఛ లభిస్తుంది
ఇష్టంవచ్చినట్టు ఎగిరిగంతేసినా
ఆ కాస్సేపే వాటికి చెల్లుతుంది
పంజరం తలుపులుతీసి బైటికి వదిలినా
కత్తిరించిన రెక్కల్తో

ఎటూ ఎగిరిపోలేక
అక్కడే అటూయిటూ తచ్చాడుతుంటాయ్
అలవాటుపడ్డ వాతావరణాన్ని
వదిలి ఎగిరిపోలేక
ఆ చోటుకే అతుక్కుపోతుంటాయ్

పగలూ రాత్రీ ప్రతిక్షణం
కనిపించే ప్రతి చూపులోనూ
వినిపించే ప్రతి శబ్దంలోనూ
చిరునవ్వులేక ఉత్సాహంలేక
ఆశలేక ఆనందంలేక
ఎండిపోయిన కళ్ళతో
తడారిపోయిన పెదాలతో
రోగులూ రోగాలూ
మూల్గులూ నిట్టూర్పులూ
వాళ్ళభయాలూ బాధలూ
ఆందోళనలూ ఆరాటాలూ
చివరికి
రోగాల కత్తులబోనుల్లో
మృత్యువిన్యాసాల వికటాట్టహాసాలు తప్ప
సంతోషానికి తావులేని
పులకింతకు వీలులేని
భయంకర దృశ్యాల జీవితానికి
ఇంకా అలవాటుపడని నర్సులు కొందరు
ఏ మూలనించో ఎగిరివచ్చిన
ఏ తియ్యని పలకరింపుకో పులకరించి
ఏ చల్లని చూపుకో పరవశించి
ఆ భయంకర దృశ్యాలనుంచి, భయపెట్టే శబ్దాలనుంచి
తాత్కాలికంగా తమనితాము రక్షించుకోడానికి

చీకటి ముసిరిన క్వార్టర్సు వదిలి
పక్కదార్లుపట్టి పోతున్నారు
కనిపించిన వెలుగు మంటకి
షార్ట్‌కట్‌లు వెతుక్కుంటున్నారు

ఉద్యోగానికో చదువుకో
పరాయివూళ్ళనుంచి నగరానికొచ్చి
అయిన వాళ్ళెవ్వరూలేక ఒంటరిగా ఉండలేక
హాస్టళ్ళలో చేరిన అమ్మాయిలు
ఆదరణలేక అభిమానంలేక
స్నేహాలకో సినిమాలకో అలవాటుపడి
అడ్డే వాళ్ళులేక అడిగేవాళ్ళులేక
అలవాటు క్రమేపీ బలపడి
వ్యామోహాలకు దాసులై
కొందరు సినిమాల పిచ్చిలో
మరికొందరు ప్రేమపిచ్చిలో
శ్లేష్మంలో ఈగలై
కుడితిలో ఎలకలై
ఊరికే గింజుకుంటున్నారు
ఏ చింతా లేనివాళ్ళు
తీరిగ్గా తినికూచోలేక
వచ్చీపోయే వాళ్ళమీద
ఆసక్తిగా కథల్ని అల్లుకుంటున్నారు

స్వదేశీ వస్తువుమీద విదేశీముద్రలా
ఎదగని మనసుకు యవ్వనచిహ్నాలు అతికి
ఆకలికోరికలకు అందాలముసుగులు తొడిగి
అనాగరిక ఆలోచనలకు ఆధునిక అలంకారాలుచుట్టి
ఆల్ట్రా మోడ్రన్ అమ్మాయిలూ అబ్బాయిలూ
ఇంకా వీధిదీపాలు వెలగనివేళల్లో

చిరువెలుగు మిగిలిన సంధ్యలో
చిక్కబడుతోన్న చలిలో
నాగరికత పేరుతో
నడిరోడ్లో స్వేచ్ఛగా
వణికించేచలిలో భుజాలురాసుకుంటూ
వెచ్చగా
వయ్యారాలుపోతూ నడుస్తున్నారు
వాళ్ళకు జీవితం ఎప్పుడూ థ్రిల్లింగ్ గా వుండాలి
ఆనందం దాని అంచులనిండా పొర్లిపోతుండాలి
తండ్రులూ, తాతలూ సంపాదించిపెట్టిన ఆస్థిని
వొళ్ళొంచకుండా, చెమటతడి పట్టకుండా
ఎగబడి మేసే పరాన్నభుక్కులకు
ఫేషన్ పెరేడ్ లూ, యవ్వన ప్రదర్శనలూ
సంధ్యావాలేసరికి చక్కని కాలక్షేపాలు
వాళ్ళ తండ్రులూ తల్లులూ
క్లబ్బులకూ మహిళా సంఘాలకూ వెళ్ళిపోయి
లంకంత మేడలన్నీ చిన్నబోతే
పాపం రోడ్లే వాళ్ళకు కాలక్షేపం మరి !

అనధికార జూదగృహానికి
క్లబ్బు అందమైన పేరు
అన్ని ఆటల్లోకీ పేకాటకి
అక్కడ పెట్టింది పేరు
కబ్బులో సభ్యత్వం
సాంస్కృతిక సంఘానికి పోషకత్వం

బేంక్ లో అకౌంటూ
బిజినెస్ లో షేర్లూ
నగరమానవుడి పలుకుబడికి సర్టిఫికెట్లు
వి ఐ పీ లకు అవి ఐడెంటిటీ కార్డులు

ఆ కార్డుల్ని చూపించి
అధికార్లతో పనులు చేయించుకోవచ్చు
సంఘంలో పై మెట్టుమీద నిలిచి మాటాడొచ్చు
అందుకే తీరిక లేకపోయినా
పెద్దపెద్ద వ్యాపారస్థులూ, కంట్రాక్టర్లూ
బడా బడా బ్రోకర్లూ, బిగ్ షాట్ లూ
క్లబ్బుల్లో సభ్యులు అవుతుంటారు
పై పన్లు ఎన్నివున్నా పక్కనపెట్టి
చీకటి పడకముందే అక్కడికి చేరుకుంటారు

దుకాణాల్లో, యిళ్ళల్లో
ఇప్పుడిప్పుడే వెలిగినదీపాల్లో
కరిగి నీరుగారి
రోడ్లమీదకి పార్లిన చీకట్లో
తెరవలేక తెరవలేక
మెలమెల్లగా కళ్ళు తెరిచిన వీధిదీపాలు
ఇంకా నిద్రమత్తు పూర్తిగా వదలక
మసకకళ్ళతో మత్తుగా చూస్తున్నట్టు
పల్చగా రోడ్లమీద వెల్తురుపడి
నిమిషాలు గడిచేకొద్దీ మత్తువదిలి
పూర్తిగా కళ్ళు తెరుచుకున్నట్టు కాంతిపెరిగి
వెల్తురులో స్నానంచేసినట్టున్నాయి రోడ్లు

వెల్తురుకరిగి చలిగాలి తిరగడంతోటే
గిరాకీ మొదలవుతుంది బార్లకు
చలికి కోరికలు గడ్డకట్టిపోకుండా
వెచ్చని ఆలోచన్లు మనసును వొదలకుండా
తగుమాత్రం పెదాల్ని తడుపుకోడానికి కొందరు—
మండే గుండెల్ని ఆర్పుకోడానికి
తగినంత కన్నీరు కళ్ళల్లోలేక

విస్కీతో చల్లార్చుకోడానికి మరికొందరు—
కష్టపడకుండా సంపాదించిన డబ్బును
మంచినీళ్ళలా ఖర్చుపెట్టేందుకు
మిత్రుల్ని పోగేసుకొచ్చినవాళ్ళు యింకొందరు—
ఫైలుమీద సంతకం చేసినందుకు
పార్టీ ప్రామిస్ చేసిన వెట్ పార్టీకి
అల్లుళ్ళలాం తరలివచ్చే అధికార్లు—
పుచ్చుకున్న లంచానికి పాపపరిహారార్థం
సగం ఖర్చుపెట్టి పక్కసీట్లను తడిపే గుమాస్తాలు—
చుక్కడితేగాని కలంకదలని కవులు—
తాగితేగాని నాగరీకులుకాలేని ఆధునికులు—
ఇంకా ఎన్నెన్నో రకాలవారు !

ఆ వేళప్పుడు అక్కడికి వచ్చేవారు
సాధారణంగా కాలక్షేపం రాయుళ్ళు
పీకలమొయ్యా తాగేవారు
బాగా చీకటిపడితేగాని రారు
సంధ్యవెంట వచ్చేవారు
గంటలతరబడి కూచునేవారు కారు
అందుకే ఆ టైములో బార్లు
కష్టమర్లతో కిటకిటలాడుతుంటాయ్
ఒక వైపు వచ్చేవారు వస్తుంటారు
మరోవైపు వెళ్ళే వారు వెళ్తుంటారు

కార్లూ స్కూటర్లూ లేనివారు
కాళ్ళనే వాహనాల్ని చేసుకుని కదిలేవారు
కష్టించి కండరాల్ని కరిగించి
చెమటకైనా వొంట్లో తడి మిగల్చలేని
ఎండిపోయిన శరీరాలవారు
ఒంట్లో రక్తాన్ని మరగించి ఆవిరిచేసి

రెక్కల్ని ముక్కలు చేసుకుని
రోజల్లా శ్రమించినా
గుప్పెటనిండా నాలుగురాళ్ళన్నా రాలనివారు
ఆకలితో యవ్వనాన్నితినేసి బతుకుతున్న పెళ్ళాల్ని
దరిద్రంతో ఆరోగ్యాన్నే నంజుకుతినేస్తోన్న పిల్లల్ని
వాళ్ళ ఎముకలపోగుల రూపాల్ని
మనసుకు అంటకుండా తప్పించుకోడానికి
పొద్దుటినుంచి పడ్డ కష్టాల్ని మర్చిపోడానికి
రెండో మూడో సారా గ్లాసుల్ని పట్టించి
గుర్రం ఎక్కినంత సంబరంగా
తుళ్ళుతూ తూలుతున్నారు
దుమ్ములోపడి దొర్లుతున్నారు

వచ్చే జీతం చాలక
నిత్యజీవితావసరాలు తీరక
అప్పులు యిచ్చేవాళ్ళులేక
ఏమాత్రం యిల్లు గడవక
అడ్డదారిలో పై సంపాదనకు
విధిగా తలవంచక తప్పక
చెరువులో చేపలకై
కొంగజపాలుచేసే కొంగల్లా
ముఖ్యమైన రోడ్ల కూడళ్ళలో
మాటువేసిన ట్రాఫిక్ పోలీసులు
అమాయకంగా దగ్గరకొచ్చే చేపల్ని
అమాంతం ఒక్కదూకు దూకి పట్టుకున్నట్టు
సైకిళ్ళనీ రిక్షాల్ని
లైటులేకుండా పోతున్నందుకు
దారితప్పి నడుస్తున్నందుకు
చటుక్కున రోడ్డుమధ్యకొచ్చి నిలేసి

వట్టినే కాస్సేపు హడావుడిచేసి డబ్బులు వసూలుచేసి
జేబులు నింపుకుంటున్నారు
దార్లు కొట్టి బతుకుతున్నారు
వాళ్ళు అవినీతి భక్షకులు రక్షకభటులు

ప్రభుత్వ ఆసుపత్రుల్లో అడ్మిషన్లకు తొలిమెట్లు
ఆ డాక్టర్ల ప్రయివేటు క్లినిక్కులు
రోగం ముదిరి ప్రాణంమీదికి వచ్చినా
పరవో పలుకుబడో లేకపోతే
పెద్దవాళ్ళనుంచి సిఫార్సులేఖలు తేకపోతే
ఆస్పత్రుల్లో ప్రవేశానికి అర్హత చాలదు
కనుకనే
అనుభవజ్ఞుల సలహాల్ని పాటించి
కన్సల్టింగు ఫీజుతో రోగులు
అప్పుడే కళ్ళు తెరిచిన క్లినిక్కులముందు
డాక్టర్లదర్శనార్థం గుమిగూడుతున్నారు

లంచాలకు మంచాలువేసే ప్రభుత్వఆస్పత్రుల్లోసైతం
మంచాలు వేయడానికిమాత్రమే లంచం
మంచిరకం మందు కావాలంటే
మళ్ళీ దక్షిణ పడేయడం అవసరం
ఆ రహస్యం తెలీని అమాయకులు
వాళ్ళిచ్చిన మంచినీళ్ళ మందుల్నే
అమృతంగా ఎంచుకుని
ఆలస్యంచేస్తే అమృతం విషంగా పులిసిపోతుందని
టైమవడంతోటే టంచన్‌గా
మందులు వేసుకుంటున్నారు రోగులు
పాపం! రంగు నీళ్ళన్నీ మందులని నమ్మే
వట్టి అమాయకులు వారు!!

ఫలమో పుష్పమో
బుడ్డీనో డబ్బునో
పనినిబట్టి తృణమో ఫణమో ముందో వెనకో
యథాశక్తి సమర్పించుకోడానికి
కంట్రాక్టర్లూ, పన్లు కావలసినవారూ
ఉద్యోగుల యిళ్ళను వెతికి పట్టుకుని
అసుర సంధ్యవేళ కళ్ళల్లో దీపాలు వెలిగించి
అయ్యగార్లకు నైవేద్యాలూ
అమ్మగార్లకు హారతులూ
అందరికీ జనరల్‌గా
నమస్కారాలూ, మస్కాలూ పెట్టి
తమ సంతోషాన్ని ప్రకటించు కుంటున్నారు
అన్నమాటను నిలబెట్టుకుంటున్నారు

సన్నకారుజీవులకు సందెవేళ సంతోషం మిగలదు
వెలుగుతోపాటు ఆశకూడా యింకిపోయి
నిరాశా నిస్పృహాలు చీకటితోపాటు విస్తరించి
కష్టాల కారడవిలా భవిష్యత్తు కనిపించి
బ్రతుకునిండా భయం పేరుకుంటుంది
జీవితంమీద మోజు రాలిపోతుంది

పొద్దున్నే వందరూపాయలు అప్పుతెచ్చి
సాయంత్రానికి ఐదురూపాయలు వడ్డీకట్టి
అమ్మకాల్లో మిగిలితే ఎచ్చాలు కొనుక్కుని
సంధ్యవేళయిళ్ళకు చేరుకుంటున్నారు
పెట్టుబడికి పెట్లో డబ్బుల్లేని తోపుడుబళ్ళహాకర్లు
అప్పులవాళ్ళ దయాందాక్షిణ్యాలమీద బతికే నిత్య దరిద్రులు

ఉదయం అద్దె రిక్షాలతో హుషారుగా వీధులు పట్టి
సాయంత్రానికి యజమానికి అద్దె కట్టి

జేబుల్లో మిగిలిన చిల్లరని లెక్కేసుకుంటూ
పడిన శ్రమకు తగ్గ ప్రతిఫలం లేనందుకు
నిరుత్సాహంతో కాళ్ళీడ్చుకుంటూ
చింపిరి గుడిసెల నిలయాలకు చేరుకుంటున్నారు
ఒళ్ళొంచి కష్టపడ్డా ఫలితందక్కని నిత్యశ్రామికులు

సంధ్యలో మురికి వాడల పూరిళ్ళు
వాళ్ళ బ్రతుకుల్లాగే చీకటి గుయ్యారాలు
ఇంకా పొయ్యిలు రాజుకోక
ఇంట్లో కరెంటు దీపాలు లేక
కిరసనాయిలు బుడ్డీ దీపాల గుడ్డి కాంతిలో
గోడలమీద కదిలే దెయ్యాల్లాంటి నీడలతో
పురుగుల్లా పాకే పిల్లలతో
ముసలమ్మల మూల్గులతో
మనుషులు నివసిస్తున్నట్టే వుండవు యిళ్ళు
మరికాస్సేపు పోతేగాని అక్కడ
వంటగిన్నెల చప్పుళ్ళూ, తాగొచ్చినవాళ్ళతిట్లూ వినిపించవు
రొయ్యిపొట్టు చారూ, ఉల్లి పులుసు వాసనలూ ఊరేగవు

కాస్సేపట్లో అక్కడ హడావుడి మొదలవుతుంది
తాగొచ్చిన వాళ్ళ అల్లరి ఆరంభమౌతుంది
వంట యింకా కానందుకు
చెప్పినకూర వండనందుకు
పిల్లలు ఏడుస్తున్నందుకు
తాగొస్తే పెళ్ళాం నిలదీసి అడిగినందుకు
తన్నులూ తిట్లూ చిందులూ
ప్రతిరోజూ అక్కడ జాతరలు !

సంధ్యలో నగరవాసులు
వెలుగునీ వివేకాన్నీ కోల్పోయి

చీకటినీ అజ్ఞానాన్నీ కట్టుకుని
చలినీ ఆకలినీ కప్పుకుని
వెచ్చగా కోరికల్ని జోకొట్టే అనుభవాలవైపు
అనుచితంవైపు అవినీతివైపు
అనాగరికతవైపు అడ్డదారులవైపు
అధోజగత్తువైపు అధివాస్తవిక సుఖాలవైపు
కొందరు అతిరహస్యంగా
మరికొందరు బాహాటంగా
తమనితాము వంచించుకుంటూ
తమలోని తమను బట్టబయలుచేసుకుంటూ
ఆధునిక జీవితం పేరుతో
పాకుడురాళ్ళమీద జారిపోతున్నారు
అలా అలా ఎక్కడికో కొట్టుకుపోతున్నారు
అందుకే
నగరంలో సంధ్య
పతనానికి గుర్తు



# రాత్రి

రెండోకంట పడకుండా
పిల్లిలా నక్కినక్కి
ఏ కొంపలోకో దూరిన సూర్యుడి వెనక
తలుపులు మూసుకుని
వెలుగంతా లోపల నిలిచిపోయి
బయట చీకటి మిగిలినట్టు
పడమటి ఆకాశంలో సంజకాంతి
ఆరిపోయే ఆఖరి వెలుగులాగ
కొద్దిసేపు ఎర్రగామండి ఆరిపోయి
ఆకాశంనిండా పిచ్చితుప్పల్లా
చిక్కని చిమ్మచీకటి పెరిగిపోయి
పాముకాటు తిన్నట్టు
నరనరాన చీకటి విషం ప్రవహించి
కణకణాన్ని చుట్టి అల్లుకుని
ఒళ్ళంతా నల్లబడిపోయింది ఆకాశం

అన్నివైపులనించీ పద్మవ్యూహంతో
ఆకాశంమీద విరుచుకుపడి ఆక్రమించి
విశాలమైన చీకటి సామ్రాజ్యాన్ని ప్రతిష్ఠించి
నగరంమీదకు విస్తరించి వ్యాపిస్తోంది చీకటి

గాలి గుర్రాలెక్కి
మంచు కొరడాలతో
నగరమంతా తిరిగి
పహారా కాస్తోంది చలి

చీకటి సరస్సులో
విచ్చలవిడిగా విహరిస్తోన్న
తీపి అనుభవాల చేపల్ని పట్టడానికి
ఎరగుచ్చి వేసిన వెండి గేలంలా వున్నాడు
అర్ధచంద్రాకారపు చంద్రుడు
గట్టిగా గాలేస్తే ఎగిరిపోయే సన్నటి తీగముక్కలా
ఎండిపోయిన రక్తమాంసాల జీర్ణ దేహుడు

వెలుగులేక వేడిలేక
చిన్నబోయింది ఆకాశం
రంగులేక రూపులేక
నల్లబోయింది నగరం

చలి ఝుళిపించే కొరడా దెబ్బలకు
ఒళ్ళు చిట్లుతుందని జనం
వీధుల్లోకి రావడానికి భయపడి
ఇళ్ళల్లో దాగుంటున్నారు
తప్పనిసరై వీధుల్లోకి వచ్చినవారు
చలిదెబ్బల్ని కాచుకోడానికి
ఊలు కవచాలు ధరించి
కంగారుగా కదలిపోతున్నారు

నగరంలో వీధి దీపాలకు
చీకటిని తరిమి కొట్టడంకన్న
అందంగా నగరాన్ని సింగారించడం ముఖ్యం
అందుకే ముఖ్యమైన వీధుల్లో

విఐపీ వాడల్లో, పెద్దవాళ్ళ ముంగిట్లో
అవసరాన్ని మించి అడుగడుగునా దీపాలుంటాయ్
చిన్న చిన్న సన్నకారుగూడేల్లో, యిరుకుమురికి వాడల్లో
అక్కడా అక్కడా ఒక్కొక్కటి చొప్పున
నామమాత్రంగానే దీపాలు వెలుగుతుంటాయ్

చీకటిని మేసి మేసి
మత్తెక్కిన వీధిదీపాలు కొన్ని
సందుల్లో గొందుల్లో
చూసేవాళ్ళు లేరని
పట్లిక్‌గా కునికిపాట్లు పడుతున్నాయ్
నగరం వొంటిమీద వెలుగు హారాల్లా
దీపాలకింద మెరుస్తున్నాయ్ సిమ్మెంటు రోడ్లు
వరుసలు తీర్చిన వీధి దీపాలు
హారాలమధ్య పొదిగిన పొడుల్లా కనిపిస్తున్నాయ్

చలికి జడిసి
పెందరాళే పరదాలు వాలి
కిటికీలూ తలుపులూ మూసుకుని
చీకటి గూళ్ళలా వున్నాయి యిళ్ళు

చెట్ల ఆకులమీద
కత్తులు నూరుతోంది గాలి
గడ్డిపరకల్ని భయపెట్టి
అదరగొడుతోంది చలి

చలికి ముడుచుకుపోయి
ఆకులమధ్య ఒదిగిపోయి
చెట్లమీది పక్షులు
రెక్కల్ని గట్టిగా ఆడించలేక
కొమ్మల్ని ఒదిలి కదల్లేక

ఉన్నచోటనే అంటుకుపోయాయ్
నిశ్చలంగావున్న చెట్లు
నిశ్శబ్దంగా నిద్రపోతున్నట్టున్నాయ్

వెలుగు కొమ్ములతో చీకటిని చీల్చుకుని
దారిచేసుకుంటూ కార్లూ బస్సులూ
నగర మహారణ్యంలో
నిర్భయంగా తిరుగుతున్నాయ్
రిక్షాలకు, సైకిళ్ళకు తగిల్చిన కొమ్ములు
ఒకవిధంగా అజగళ స్థనాలు
అవి అలంకారానికేగాని ఆత్మరక్షణకు కావు
చట్టానికేగాని చీకటిని చీల్చడానికి కావు
అందుకే అవి గుడ్డాళ్ళలా
తడుముకుని తడుముకుని మరీ కదుల్తున్నాయ్

సాయంకాలంనుండి బిజీగా వుండి
పెద్ద మొత్తాల్లో లాభాలుపిండి
ఇప్పుడిప్పుడే దుకాణాలు తెరిపిన పడి
అమ్మకాలు పలచబడి రాబడులు సన్నబడి
ఏదో ఒక ధరకు ఆఖరిబేరాలకు రాజీపడి
వ్యాపార్లు గళ్ళాపెట్టెలు నింపుకుంటున్నారు
ఆ రోజు అమ్మకాల్ని తాపీగా లెక్కేట్టుకుంటున్నారు

షావుకార్ల వేళ్ళమధ్య నోట్లు
గుమస్తాల కళ్ళల్లో పడ్డ నలుసులు
ఏనుగుముందు చిట్టెలుక్క
తన అల్పత్వం గుర్తొచ్చినట్టు
దోసిళ్ళకొద్దీ రూపాయినోట్లు చూస్తే
గుమస్తాలకి తమ దరిద్రమే గుర్తొస్తుంది
తీరని కోరికల పెరేడులో

చింపిరి బ్రతుకుల్ని తొడుక్కుని
కవాతు చేసే తమ వికారి రూపాలకి
ప్రేతకులు నవ్వుతున్నట్టనిపిస్తుంది
మనసు ఒక్కసారిగా కలుక్కుమంటుంది

మేడల్లో ట్యూబులైట్లు వెలుగుతున్నా
మూసిన తలుపుల వెనక
మందమైన కాంక్రీటు గోడలమధ్య
వెల్తురు నిలిచిపోయి
చిమ్మచీకట్లో మునిగిపోయాయి మేడలు
మురికివాడ పాకల్లో చమురుదీపాలే వెలుగుతున్నా
ఒంటిమీదేకాక యింటిమీదసైతం
సరైన ఆచ్ఛాదన లేక
తడికలు బిగించుకున్నా
సందుల్లోంచి జారిపోయి
వెల్తురు గుడ్డిదైనా
బైటికి పొర్లిపోయి
అస్పష్టంగానైనా
కాంతితో మెరుస్తున్నాయి పూరిళ్ళు

పూరిళ్ళ జనానికి
కారం ముద్దో కాకరకాయ కూరో
అన్నంలోకి ఆధరువుంటే చాలు
పాపం సొమ్ముతో మహారాజుల్లా మెలిగేవారికి
పాలూపాయసాలో, పలావో వుండకపోతే ఆకలి తీరదు
అందుకే పెద్దింటి వంటగదుల్లో
పొయ్యిలు యింకా మండుతూనే వున్నాయ్
పూరింటి పొయ్యిల్లో
నిప్పులు ఎప్పుడో ఆరిపోయి
కుక్కలో పిల్లులో అప్పుడే పొర్లుతున్నాయ్

ఆకలి పేగుల కోరస్ గీతాలతో
తాగొచ్చినవాళ్ళ తూలే కాళ్ళ చిందులతో
తిట్లతో పోట్లాటలతో
అరుపులతో అల్లర్లతో
సంధ్యలో పైకప్పులు ఎగిరిపోయినట్టు
బడబడలాడిన మురికివాడల పూరిళ్లు
చీకటి చిక్కబడేసరికి సద్దు మణిగి
బుద్ధిగా నిద్రపోతున్నాయ్

పగలంతా కష్టపడి పనిచేసి
సాయంకాలానికి అలసి సొలసి యింటికొచ్చి
కడుపునిండా తినడానికి తిండిచాలక
ఉన్నదానితోనే సగం కడుపు నింపుకుని
నిద్రతోనే ఆకలిని దూరానికి తరుముకుని
ఒళ్ళుమరిచి నిద్రపోతున్న శ్రమజీవులతో
నిశ్శబ్దంగా నిశ్చలంగా వున్నాయి పూరిళ్ళు

పగలు టిఫిన్ల మీద టిఫిన్లు దట్టించి
తిన్నది అరక్క
రాత్రి భోజనానికి కడుపులో ఖాళీలేక
మరికాస్సేపు ఆలస్యం చేద్దామని
కబుర్లతో కాలక్షేపం చేస్తున్న గొప్పింటి మారాజులతో
నిద్రకి వెలుపల
నిశ్శబ్దానికి దూరంగా
సందడిగా వున్నాయి భవంతులు
ఆశ్రితులకు కల్పవల్లి
అవకాశాల వాణి ఆకాశవాణి
అక్కడ యింకా గొంతు చించుకొంటూనేవుంది
ఆకాశవాణి ఆస్థాన కవులో, కథకులో
వాళ్ళ కాకారాయుళ్ళో, బాకారాయుళ్ళో

వారం తిరక్కుండానే మళ్ళీ గాలిలో కొచ్చి
తమ సుపరిచిత కంఠాన్ని వినిపించి
శ్రోతల జ్ఞాపకశక్తిని పరీక్షిస్తున్నట్టుంది

ఎండిపోయిన శబ్దాలమీంచి బరువుగా కదిలిపోతూ
సినిమాలకి ఎగబడేవాళ్ళు
ఇళ్ళకు దిగబడే వాళ్ళు
వాళ్ళ పాదాల కింద
చిదిగిపోతున్న నిశ్శబ్దపు చితుకులు
నిశ్చలమైన రాత్రిమీద అవి
శబ్దాల్ని చెక్కుతోన్న చప్పుడులు !
నగరాన్ని నిద్రపుచ్చడానికి
జో కొట్టుతున్న దరువులు ! !

రాత్రి రెండో ఝూమువరకు మేలుకొని
ఆలస్యంగా నిద్రపోయి
ఉదయం మరీ ఆలస్యంగా నిద్రలేచి
హడావుడి పడడం నగరానికి రివాజు
చీకటంటే దానికి విపరీతమైన మోజు
అందుకే
సగంరాత్రివరకు చీకట్లో మేలుకుని
అదిచేసే పాపాల్లో పాలుపంచుకుని
ఉదయం ఎండెక్కేవరకు నిద్రపోయి
తొలి వెలుగు అందాన్ని మర్చిపోయి
బారెడు పొద్దెక్కితేగాని కళ్ళు తెరవదు నగరం

అసలు నకిలీల మధ్య
తెలుపు నలుపుల మధ్య
మంచి చెడ్డల మధ్య
తేడా స్పష్టంగా తెలిని చీకట్లో

నల్లని ముసుగు కింద స్వేచ్ఛగా
రాత్రివేళ మెలగడానికి మనిషికి
సిగ్గుకీ సంకోచానికీ
గౌరవానికీ గొప్పతనానికీ
అంతగా భంగం కలగదు
చీకటి మరుగున చేసిన ప్రతిపనీ
అందరి కళ్ళకూ విధిగా ఆనదు
కనుకనే చీకటిని ఆసరా చేసుకుని
కోరికల ఆకలిని తీర్చుకుని
ప్రజల్లో పెద్దమనుషుల్లా
చెలామణీ అవుతుంటారు కొందరు
పాపాలమధ్య బ్రతుకుతూ
బట్టకట్టి మిద్దె లెక్కుతుంటారు వారు

చీకటి చిక్కగా పేరుకోగానే
నగరంనిండా విచ్చలవిడిగా వెదజల్లినట్టున్న
పాపాల పుట్టల్లోంచి, అద్దాలగుహల్లోంచి
చీకటి గుబురుల్లోంచి, చలి భూగృహాలనుంచి
నగర నాగరిక జంతువులు
విషపు ఆలోచనల పురుగులు
రకరకాల భయంకర ఆకలిమృగాలు
వీధుల్లోకొచ్చి దారికాచి
విచ్చల విడిగా వేటాడుతున్నాయ్
నిశాచరులై తిరుగుతున్నాయ్

సినిమాహాళ్ళ దగ్గర, స్టేషన్ల ముందర
బార్ల ఎదుట, బస్ డిపోల వద్ద
బజారు సందుల లోతట్టున
చీకటి మరుగున
రోడ్డుపక్క దీపాలక్రీనీడల్లో

పార్కు చేసిన రిక్షాల్లో, టాక్సీల్లో
ఒంటిమీది యవ్వనాన్ని పెట్టుబడిగా పెట్టుకొని
పరదాల వెనక పడిగాపులు కాచుకుని
రహస్యంగా వ్యాపారం సాగించే అమ్మాయిలు
ఒచ్చిన బేరాలు చెయ్యిజారిపోకుండా
లోపలికి ఎక్కించుకుని దగ్గరికి లాక్కుని
సరసాల్ని సన్నని మెరుపుల చిరునవ్వుల్ని
ఎరలుగావేసి కొక్కేలు బిగించి
గాలిని ఖరాబుచేసి జేబులు ఖాళీచేసి
సజావుగా వ్యాపారం సాగిస్తున్నారు
బరువుగా అక్కడినుండి సాగిపోతున్నారు

అధికార్ల దాహాన్ని గుర్తించి
బుడ్డీలు పట్టించి
గుట్టుగా అమ్మాయిల్ని పంపించి
పనులు చేయించుకునే కంట్రాక్టర్ల చలవవల్ల
బార్లకీ, వొళ్ళమ్ముకునే అమ్మాయిలకీ
నగరంలో రాత్రిపూట గిరాకీ ఎక్కువ

గంజాయిపొగ గొంతువరకూ దట్టించి
తన్మయత్వంలో మునిగి అరమోడ్పు కళ్ళతో
తత్వాలు పాడే బైరాగుల్లా
మత్తుగా జోగుతూ
రాసక్రీడలు మనసునిండా ఎక్కించి
ఆనంద పారవశ్యంలో పరిసరాల్ని మరిచి
రాగాలుతీసే భక్తవరేణ్యుల్లా
చిద్విలాసంలో మునిగి తేలుతూ
ఈ లోకంమాట మర్చిపోయి
మరో లోకంవైపు చూస్తున్నాయ్ బార్లు
అక్కడ దీపాలు దేదీప్యమానంగా వెలగక

మత్తెక్కినట్టు మసగ్గా
కలల్లోంచి తొంగి చూస్తున్నట్టుంటాయ్
అక్కడ నీడలు వెల్తురులో కరగక
దెయ్యాల్లా పొడుగ్గా
స్మశానంలోంచి లేచొచ్చి తిరుగుతున్నట్టుంటాయ్
అక్కడ
వుండి వుండి ఎవరో
గాలిని గద్దించినట్టు అరుస్తారు
తాగి తాగి ఏ మనిషో
గ్లాసులతో మాట్లాడుతున్నట్టు
మెల్లగా రహస్యాలు చెప్తుంటాడు

పరాయివాళ్ళ పెళ్ళాల మీద
ఇరుగు పొరుగు ఆడాళ్ళమీద
తమ కింద పనిచేసే అమ్మాయిల మీద
అక్కడ స్వేచ్ఛగా కబుర్లు దొర్లుతుంటాయ్
మనసులోని చీకటి అరల్లో
పాలిపోతోన్న రహస్యాలు
ఏ బలహీన క్షణంలోనో
బైటికి తొంగి చూసి
బట్టబయలై వినిపిస్తుంటాయ్
అక్కడ గాలి వేడెక్కి
గదులు జ్వరం వచ్చినట్టుంటాయ్
అక్కడ మనసులు వెచ్చబడి
తాపంతో తూలిపోతుంటాయ్

ఒకమనిషి మరోమనిషిని పీక్కుతినడం
మహాపాపమని
దేశమే మరో దేశాన్ని పీక్కుతినే
ఒక రాబందుమార్కు దేశంలో

దానిలాంటి మరికొన్ని ధనమదాంధ దేశాల్లో
భోగాలు పెరిగి పెరిగి
వైరాగ్యం వంటబట్టి
వ్యాప్తిలోకొచ్చిన దిగంబరత్వాన్ని
దిగుమతి చేసుకున్నట్టుగా
ఖరీదైన బార్ లో కేబరె నర్తకి
ఒంటి మీదున్న బట్టల్ని
ఒక్కటొక్కటిగా వొలిచి పారేసి
అరచేతి వెడల్పు గుడ్డపీలికలు రెంటిని
ఆచ్ఛాదనగా వొంటిమీద మిగిల్చి
ఎండ పొడ ఎరగని వొళ్ళంతా చూపుతూ
అంగాంగాల్ని కసిగా వూపుతూ
అంకమ్మ శివాలేస్తోంది
దారితప్పి నగరానికి వచ్చిన
అనాగరిక ఆటవికలా
విచ్చల విడిగా గెంతి చిందులేస్తోంది

అక్కడక్కడ కొన్నిచోట్ల
పెళ్ళాంకన్నా ప్రేమగా
స్నేహితురాళ్ళను మించి సరదాగా
తాగినంతసేపూ కాలక్షేపానికి
'కాల్ గరల్స్' రడీగావున్నారు
అడిగినంతా పట్టించి
తినగలిగినంతా తినిపిస్తే
ఆ కాస్సేపూ పెళ్ళాన్ని మరిపించి
పరిచయంలేకున్నా స్నేహితురాలిలా మురిపించి
కబుర్లతోనే కడుపు నింపుతుంటారు వారు

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో
బార్లకి పిలిస్తే రాని పెళ్ళాలతో

వాదించే ఓపికలేక
గృహమే స్వర్గసీమగా
బ్రతుకే పూలరథంగా
జీవించడం చేతకాక
బారుల్లో కాల్‌గరల్సుతో
కబుర్లతో కాలక్షేపంతో
చేతిచమురు వదుల్చుకొని
సరదాగా చలిరాత్రిని వెలిగించుకుంటున్నారు
నగర నాగరీకులు కొందరు

పనులు జరగడానికి
డబ్బుతో కానిపని
అమ్మాయిల్ని అందిస్తే అవుతుందని
ఉన్న వాటిలో అదే
తక్కువ ఖర్చులో తేలేదని
కంట్రాక్టర్లు లెక్కలువేసి తేల్చి
అధికార్లకీ అప్పుడప్పుడు పాలకులకీ
అవసరం వచ్చినప్పుడు పక్కలమీదికి
అందమైన అమ్మాయిల్ని తీసుకొచ్చి తార్చి
సూక్ష్మంలో మోక్షంపొందే
చిట్కా మంత్రం వేస్తున్నారు
అత్యాధునికంగా అలంకరించుకున్న అమ్మాయిలు
నిద్రపోకుండా మేలుకుని ఎదురుచూస్తూ
వాళ్ళు ఫోనుల్లో కబురంపితే
టేక్సీల్లోవచ్చి వాలుతున్నారు

లంచాలు చెల్లించకపోతే
ఈ రోజుల్లో ఎక్కడోగాని ఉద్యోగంరాదు
అధికార అర్హతలు ఎన్నివున్నా
ఇంటర్వ్యూ పంపడానికేగాని

ఉద్యోగం రావడానికి కాదు
అనధికార అర్హతల లిస్టు వేరేవుంది
దానిమీదే ఉద్యోగంరావడం ఆధారపడివుంది
కొందరికి ప్రముఖుల సిఫార్సులేఖలు వుండాలి
మరికొందరికి అధికార్లతో ఫోన్లు చేయించాలి
కొందరికి పెద్దవాళ్ళతోవున్న బంధుత్వం విప్పిచూపాలి
మరికొందరికి అవసరానికి ఆదుకొనే నమ్మకం కలిగించాలి
కొందరికి లంచాలు యివ్వాలి
మరికొందరికి మంచాలు వేయాలి
ఏమీలేనివాళ్ళు, ఏదీ చేతకానివాళ్ళు
ఉద్యోగానికి అర్హులుకారు
ఎంతగింజుకున్నా వాళ్ళకి ఉద్యోగం రాదు

నిజానికి
మంచాలువేసే అవసరం మగాళ్ళకి లేదు
ఆడాళ్ళకి అప్పుడప్పుడు ఆ ప్రమాదం తప్పదు
కొందరు తెలివిగా తప్పుకుంటారు
లంచాలుపోసి మంచాల జోలికి మరి పోనివ్వరు
దురదృష్టవంతులు బలవంతంగా తప్పుచేస్తుంటారు
లంచాలకు స్తోమతులేక మంచాలే వేస్తుంటారు

గతిలేని అభాగినులు ఎందరో
తమ పాలిటి శాపంగా మారిన రాత్రిలో
నిర్దాక్షిణ్యంగా అంతరంగం పికపిసికి
బలవంతంగా బలిపశువులా కదిలి
పరిస్థితులకు లొంగిపోతున్నారు
పై వాళ్ల ఆకలికి బలై పోతున్నారు

ప్రతిరోజూ నగరానికి
ప్రవాహంలా వచ్చే జనానికి

నిలకడగా నిలవడానికి
వసతినిచ్చే లాడ్జింగులు, బోర్డింగులు
ఆధునిక నగరానికి కావలసిన హాంగులు
ఆ హాంగులు లేకుండా ఏ నగరమూ వుండదు
పగలనక రాత్రనక
అక్కడికి వచ్చిపోతుండే జనానికి
అంతస్థులనుబట్టి, అభిరుచులనుబట్టి
అర్థబలాన్ని బట్టి, అవసరాలనుబట్టి
అనేకరకాల లాడ్జీలు వుంటాయ్
కొన్నిచోట్ల 'మడతమంచాలు అద్దెకివ్వబడును'
మరికొన్నిచోట్ల 'సకల సౌకర్యాలూ కల్పించబడును'

అక్కడి సౌకర్యాలకు అలవాటుపడ్డవారు
అడపాతడపా నగరానికి వస్తుంటారు
తాగడానికి 'ఫారిన్ సరకు' మొదలుకొని
చదవడానికి సెక్స్ సాహిత్యం వరకు
అన్నంలోకి కోడి కూర మొదలుకొని
పక్కలోకి అమ్మాయి వరకు
సర్వం ఋణాలమీద సరఫరా అవుతాయ్
అన్నీ అతిరహస్యంగా సాగిపోతాయ్

అలాటి లాడ్జీలు నగరంలో కొల్లలు
వాటికి రాత్రిపూటే ఎక్కువగా బేరాలు
పొరుగూళ్ళ నించి సరేసరి
నగరంలోవాళ్ళుసైతం
అక్కడ అప్పుడప్పుడు దిగుతుంటారు
'సకలసౌకర్యాలూ' పొందుతుంటారు

ఎర్ర దీపాల వీధుల్లో రాత్రి వ్యాపారం పుంజుకుని
తలుపులూ కిటికీలూ మూసుకుపోయి

గదుల్లో దీపాలు ఆరిపోయి
చీకటిలో కూరుకుని
రహస్యమంతనాలు చేస్తున్నట్టున్నాయ్ యిళ్ళు
ఆ సానివాడ సందుల్లో
వీధిదీపాల వెలుతుర్లో
చెడతిరుగుతున్నాయ్ సెంటువాసనలు
అక్కడి యిళ్ళల్లో అందమైన ముందరి గదుల్లో
వయ్యారాలు పోతున్నాయి అగరొత్తుల పొగలు
దీపాలు ఆరిపోయిన బెడ్ రూముల్లో
వెచ్చబడుతోన్న గాలిలో
గుప్పున ఎగురుతున్నాయ్ నలిగిన పూలవాసనలు

అక్కడ మండే కోర్కెల్లో
మరిగే రక్తంలో
గాలి వెచ్చబడి
గదులుదాటి గోడలుదాటి
సందులు దాటి గొందులు దాటి
వీధుల్ని సైతం చుట్టుముట్టి
చలిలో తడిసొచ్చిన సరసులకు
వాడలో అడుగెట్టగానే
బ్రోకర్లకన్నా ముందే ఎదురెళ్ళి పలకరించి
శాలువలా వెచ్చగా చుట్టి ఉపచారాలు చేసి
సాదరంగా ఆహ్వానిస్తోంది
దారిచూపి నడిపిస్తోంది

బ్రోకర్లు బీడీలు కాలుస్తూ
వీధి దీపాల క్రీనీడల్లో
ఇంటి అరుగుల చీకటి మూలల్లో
దారికాచి
ఎక్స్ రే కళ్ళతో

పూలరంగళ్ళ జేబుల్లోకి చూపుల్ని ఫోకస్ చేసి
వాళ్ళ అవసరాన్ని బట్టి, అంగీకారాన్ని బట్టి
వాళ్ళ రసికతను బట్టి, రాలుబడిని బట్టి
అమ్మాయిల్ని చూపుతున్నారు
వచ్చిన బేరాలు చెయ్యి జారిపోకుండా
వాక్చాతుర్యంతో వాళ్ళని కట్టిపడేస్తున్నారు

అక్కడ మూడుపూలు ఆరు కాయలుగా
ముగ్గురు అమ్మిలు ఆరుగురు అబ్బిలుగా
సజావుగా వ్యాపారం సాగిపోతోంది
పడగ్గదులన్నీ విటులతో నిండుకుని
సగంమందికి ముందుగదుల కుర్చీల్లో
మీనమేషాల లెక్క తప్పనిసరౌతోంది

ఇంతటి మహా నగరానికి
ఒకటో రెండో సానివాడలు చాలవు
అసంఖ్యాకమైన పూల రంగళ్ళకు
ఆశ్రయం యివ్వడానికి
అవి పుష్పకవిమానాలు కావు
అందుకని నగరంలో అక్కడక్కడ
గౌరవమైన యిళ్ళు కొన్ని వున్నాయ్
అలాటి అవసరాల్ని అవి
గుట్టుగా తీరుస్తున్నాయ్

తెలిసో తెలియకో
యవ్వనోద్రేకంలోనో, పరిస్థితుల ప్రాబల్యం వల్లనో
చీకటి తప్పుచేసి
పాపంపండి ఫలితం కనిపించేసరికి
గుట్టుగా కడుపులో పెట్టుకుని దాచుకోలేక
డాక్టర్ల వెంటపడేవారికి
చిక్కని చీకటి చక్కని మరుగు

ఉన్న ఊరు వదిలి
పొరుగువాడిని గురించి పట్టించుకోని నగరానికొచ్చి
అజ్ఞాతంలోనో, అయినవాళ్ళింట్లోనో
తొమ్మిది నెలలూ నిండేవరకు వుండి కనేవారికి
చీకటి చక్కని కవచం
ఎవరికో పుట్టిన బిడ్డని
ఆ కవచంకింద రక్షణపొంది
ఏ చెత్తకుండీకో పెంటకుప్పకో
దయదలిస్తే అనాథాశ్రయం ఆవరణకో
ఇక్కడ నిర్భయంగా అప్పజెప్పొచ్చు
అలాటి కసాయిదృశ్యాలు
అప్పుడప్పుడు యిక్కడ వుండేవే
అలాటి చీకటి చిత్రాలు
నగరంలో రాత్రికి మామూలే

కేడీలూ, కత్తి వ్యాపార్లూ
దొంగసరుకుల రవాణాదార్లూ
దార్లుకొట్టి బతికేవాళ్ళూ
ఎక్కువగా నిశాచరులు
అధికార్ల కళ్ళకు వాళ్ళు
చీకటితో గంతలుకట్టి
అమాయకప్రజల్ని
నిలువునా మోసంలో ముంచి
చడీచప్పుడు లేకుండా
రెండోకంట పడకుండా
పాపాల్ని మేసి జీవించే రాకాసి బకాసురులు
వాళ్ళకు వేటాడ్డానికి రాత్రిపూటే ఎక్కువవీలు

మనిషి జేబుకొడితే నేరం
అందుకు చట్టంతో దండించొచ్చు

మీద చెయ్యి చేసుకుంటే ఘోరం
దానికి జైల్లో పెట్టించొచ్చు
ప్రాణాల్నితీస్తే అది మహాపరాధం
తీసిన ప్రాణానికి ప్రతిగా ఉరిశిక్ష వెయ్యొచ్చు
కాని—
ప్రాణాల్ని నిలిపే ఆహారపదార్థాల్ని కల్తీచేసి
అనేకానేక అమాయక ప్రజల ఆరోగ్యాల్ని హరించి
మెలమెల్లగా
వాళ్ళ ప్రాణాల్నిసైతం బలిగొనే కల్తీ వ్యాపారస్థుల్ని
హంతకులుగా లెక్కించి
నిలువునా చీరేసే
నడిరోడ్లో ఉరితీసే
పకడ్బందీ అయిన చట్టం ఏదీలేదు
ఉన్న చట్టంకింద శిక్ష చాలా తక్కువ
వచ్చేలాభంతో పోలిస్తే
కంటికికూడా అది ఆనదు
కనుకనే కల్తీ వ్యాపారస్థులు బరితెగించిపోతున్నారు
కనిపించిన ప్రతి సరుకునూ కల్తీచేసి
ప్రజల ఆరోగ్యాన్ని ధనాన్ని దోచుకుంటున్నారు

గొడౌనుల్లో, ఫ్యాక్టరీల్లో
దుకాణాల్లో, దెయ్యాల కొంపల్లో
తాళాలువేసుకున్న తలుపులవెనక
శబ్దాలు దాటని మందమైన గోడలమధ్య
చూపులువాలని చిక్కని కప్పులకింద
అన్యాయాలకీ అక్రమాలకీ
పాపాలకీ కిరాతకాలకీ
చీకటితో కల్తీ వ్యాపారస్థులు
ఆలయాలు కడుతున్నారు

అక్కడపెట్టే నైవేద్యాలకు
ప్రత్యేకంగా ఫలానా సరుకని ఏంలేదు
డబ్బుపెట్టి కొనక్కరలేనివి
అప్పనంగా ఎక్కడబడితే అక్కడ దొరికేవి
మంచినీళ్ళూ, మట్టిబెడ్డలైనా చాలు

దొంగసరుకుల రవాణాదార్లు
అవసరవస్తువుల అక్రమనిలవదార్లు
ఒక బెత్తెడు అటూ యిటూగా
కల్తీ వ్యాపారులకు అన్నదమ్ములు
చీకటిలో కరిగిపోయే రాత్రిచిత్రాల్ని
కనిపెట్టగలిగే ఎక్స్ రే కళ్ళుంటే
లెక్కలేనన్ని వీళ్ళ అక్రమాల్ని
వరుసగా రికార్డు చెయ్యొచ్చు

సైకిల్ ట్యూబుల్లో కాపుసారా
కార్ల డిక్కీల్లో స్మగుల్డు సరుకులు
మిఠాయి డబ్బాల్లో గంజాయి ముద్దలు
సబ్బుల డొక్కుల్లో బంగారం బిస్కట్లు
నమ్మకంగా అవిచేసే రహస్య ప్రయాణాలు
దుకాణాల్లోంచి గొడౌనుల్లోకి
అక్కడినుంచి చీకటి కొట్లల్లోకి
నిత్యజీవితావసర వస్తువుల కదలికలు
అంచెలంచెలుగా వాటి నడకలు
నగరంలో చీకటిలో కరిగిపోయిన రాత్రి చిత్రాలు

అంతకు మించిన దారుణాలు
ఎన్నెన్నో అన్యాయాలు, అక్రమాలు
దౌర్జన్యాలు, దుర్మార్గాలు
చీకటి ముసుగుకింద పాలిపోయి

వెలుక్కి అందకుండానే
వార్తల్లోకి రాకుండానే
రాత్రిలో కూరుకుపోతున్నాయ్
రహస్యంలో ఒదిగిపోతున్నాయ్
అందుకే —
నగరంలో రాత్రి
పాపానికి ప్రతీక



# అర్ధరాత్రి

పడమటి కనుమల్లో పర్వతాలు
సంధ్యావేళ అగ్నిపర్వతాల్లా మండి
రాత్రికి లావాలా పొర్లిన చీకటి
చెట్లనీ చేమల్నీ
పొలాల్నీ పల్లెల్నీ
నిలువునా ముంచి ప్రవహించుకొచ్చి
నగరంలో అడుగు పెట్టి
అర్ధరాత్రికి క్రమంగా చల్లబడి గడ్డకట్టినట్టు
శిలలా నిశ్చలమై పోయింది
చీకట్లో కూరుకుపోయిన నగరం
చెట్లూ చేమలూ
ఇళ్ళూ గుళ్ళూ
అన్నీ లావాలో కాలి మసై
బొగ్గుల కొట్టంలావుంది నగరం

ఎక్కడా అలికిడిలేదు
ఎటునుంచీ శబ్దం వినిపించడం లేదు
ప్రాణంతో బైటపడ్డవాళ్ళెవరూ లేనట్టు
నిర్జనమైపోయిన రోడ్లు
బోసిగా కనిపించి

గుండెల్లోంచి భయాన్ని
బైటికి తోడి తీస్తున్నాయ్
గాలి కూడా కదలడం లేదు
మంచుకి తడిసి బరువెక్కి
'నీళ్ళుపోసుకున్న' స్త్రీలా
ఉన్నచోటనే చతికిలబడి పోయినట్టుంది
కాదంటే
మంచుకి జడిసి
చెట్ల గుబురుల్లో నక్కి
ఆకుల్ని వెచ్చగా కప్పుకుని
హాయిగా నిద్రపోతున్నట్టుంది

ఇళ్ళ కప్పుల మీద, మేడ మిద్దెల మీద
మంచుపడి తడిసి
చీకటి అంటుకుపోయి
మరీ నల్లగా వున్నాయి మనుషుల గూళ్ళు
ముఖ్యమైన రోడ్లమీదనేతప్ప
మామూలు వీధుల్లో దీపాలు వెలగడంలేదు
ఇళ్ళల్లో బెడ్ రూమ్‌లైట్లు వెలుగుతున్నా
మూసిన తలుపుల్ని దాటుకుని బైటికి రావడంలేదు

రాత్రి పాపాలకి కుళ్ళి
పురుగులు పట్టి పుచ్చి
చెట్టున నిలవక రాలిపడిన పండులావుంది
అర్ధరాత్రిపూట నగరం
లుకలుకలాడే తెల్లని పురుగులు
అక్కడక్కడ వెలుగుతోన్న వీధి దీపాలు
ఉండి వుండి ఒకో కారో, సైకిలో కదిలి
తెల్లని దీపాలు రోడ్లమీద జారి
పురుగులు పాకుతున్నట్టున్నాయ్

కుష్టురోగి ఒంటి మీద
వారించుకుపోయిన రక్తమాంసాల అడుగున
తెల్లగా బైటపడ్డ ఎముకల్లా
దీపాలకింద సిమ్మెంటు రోడ్లు
అసహ్యంగా తొంగిచూస్తున్నాయ్

అడ్డమైన తిరుగుళ్ళూ తిరిగి
రోగాలుతగులుకొని ఒళ్ళంతా కుళ్ళి
ఒంట్లో సత్తువ పోయి ఎముకలపోగు మిగిలి
ఒంగిపోయిన నడుముతో
అస్థిపంజరంలా వున్న చంద్రుడు
చూపు సరిగ్గా ఆనక
కళ్ళు పొడుచుకుని చీకట్లోకి చూస్తూ
అప్పుడప్పుడు మబ్బుగుంటల్లో
కాలుజారి పడ్తూ లేస్తూ
నడవలేక నడవలేక నడుస్తూ పోతున్నాడు
ఆకాశంలో రోగిష్ఠి చంద్రుడు

లెక్కలేనన్ని చేతుల్ని చాచుకుని
నగరం తలమీద
గొడుగుపట్టిన ఆకాశం మర్రిగుబురులోంచి
గుడ్లగూబల్లా చూస్తున్న నక్షత్రాలు
రాత్రి ప్రతిష్ఠించిన చీకటి రాజ్యానికి
రక్షకభటుల్లా కాపలా కాస్తున్నాయ్
నిద్రపోనివాళ్ళవైపు గుర్రుగా చూస్తున్నాయ్

చంద్రుడి గుడ్డి వెలుగు
నక్షత్రాల మసక వెల్తురు
ఆకాశంమీద పల్చగా పరుచుకుని
చీకటిలో చిరువెలుగు కలిసినట్టు

బూడిదరంగులో వుంది ఆకాశం
మొదట్లో ఆకాశాన్నీ భూమినీ
సమానంగా ఆవరించిన చీకటి
మెలమెల్లగా అడుగున నేలమీదికి
మడ్డిలా దిగిపోయినట్టు
అర్ధరాత్రికి చిక్కగా
నగరంమీదకు చేరుకుంది చీకటి

ఎక్కడా శబ్దం ఎగరడంలేదు
కదలికలేక అలికిడిలేక
తెలివిలేక మాటలేక
అంతటా నిశ్శబ్దమే పరుచుకుంది
పగలల్లా నగరంలో
పెనంలో పేలాల్లా తుళ్ళిన శబ్దాలు
నోట్లో కరకరలాడిన మాటలు
మంచులో తడిసి చప్పబడిపోయినట్టు
మధ్యరాత్రిలో మెత్తబడి
ముద్దల్లా వుండచుట్టుకుపోయాయ్
బుద్ధిగా నిశ్శబ్దంలో ఒదిగిపోయాయ్
వుండివుండి ఏ సందులోనో
నిశ్శబ్దాన్ని చిదగ్గొడుతున్నట్టు
శబ్దాలపెచ్చుల్ని చిందరవందరగా వెదజల్లుతున్నట్టు
మెషిన్ గన్‌తో అరుపుల రౌండ్లను
పరంపరగా వదులుతున్నట్టు
కసిగా అరుస్తున్నాయి వీధికుక్కలు

రోడ్ల పక్క ఫుట్‌పాత్‌లమీద
దుకాణాల అరుగులమీద
మూడంకెలో ముడుచుకుపోయి
చాలీచాలని చింకిపాతల్ని

శీలా
వీర్రాజు

చలికి రక్షణగా కవచాల్ని చేసుకుని
కదిలితే కాళ్ళో చేతులో బైటపడి
చలిపులి మీద విరుచుకుపడుతుందని భయపడి
నిద్రలోనైతం కడుపులో పిల్లలా
మునగదీసుకుని ముడుచుకుపోతున్నారు
ఉండడానికి కొంపల్లేనివాళ్ళు
అడుక్కుతినే నిర్భాగ్యులు దౌర్భాగ్యులు

ఉండడానికి కొంపవున్నా
వెచ్చగా నిద్రపోవడానికి సరైన పక్కలేక
కప్పుకోడానికి దళసరి రగ్గయినా లేక
కఠిక నేలమీదో తాటాకు చాపలమీదో
మాసిన చీరల్నో పంచెల్నో మీదవేసుకుని
చలిబారినుండి తప్పించుకోలేక
దగ్గరగా ఒకరిలోఒకరు ఒదిగిపోలేక
ఒదిగితే ప్రమాదం ముంచుకొస్తుందని
ఉన్న గంపెడు పిల్లలకీ మరొకరుతోడై
అంతంతమాత్రంగానే వొంట్లో మిగిలిన
రక్తమాంసాలనే కాక దరిద్రాన్ని సైతం పంచుకుని
కష్టాలకీ కన్నీళ్ళకీ వారసులు కాగలరని
కన్నవాళ్ళకి మరిన్ని కన్నీళ్ళు కార్పించగలరని
ఒకరికొకరు దూరంగానే వుండిపోయి
కళ్ళనిండా నిద్రకు సైతం దూరమై
చలికి గజగజ లాడిపోతున్నారు
చింపిరి బ్రతుకుల పూరిళ్ళ గృహస్థులు

జరీ బ్రతుకుల కాంక్రీటు భవంతుల గృహస్థులకు
ఆ బాధలేదు, యిబ్బంది లేదు
చలినిగూర్చి వాళ్ళకు ఏ మాత్రం భయంలేదు
రబ్బరు తొడుగుల్నో మందుల మాత్రల్నో

అడ్డుగా పెట్టుకొని హాయిగా గడపొచ్చు
పరుపుల్లో రగ్గుల్లో నిశ్చింతగా వొదిగి
సంతోషంలో మునిగి సుఖంగా నిద్రపోవచ్చు

పగలు పోట్లాడుకున్నా
రాత్రికి రాజీకి
పిలవకపోయినా వచ్చే మధ్యవర్తి
చలి
మనసు వున్నా లేకున్నా
మధ్య నిలిచి
శరీరాలు రెంటినీ దగ్గరగా కలిపే
ముడి
అందుకే గొప్పింటి మారాజులకు
చలిమీద ఎక్కడలేని మోజు

సెకండ్ షో బేరాలకి
సినిమా హాళ్ళముందర చేరి
ఆటవదిలేవరకు రిక్షాల్లోనే ముడుచుకుపోయి
కునికిపాట్లు పడ్తూ
అంతలోనే కలల్లో పడ్తూ లేస్తూ
చలికి గజగజ లాడిపోతున్నారు రిక్షావాళ్ళు
బండి తొక్కుతున్నప్పుడు
ఆమడదూరానికి పారిపోయిన చలి
కదలక కూచున్నప్పుడు
నాలుగు వైపుల్నించీ చుట్టుముట్టి
గుండెల్ని పట్టుకొని కుదిపేస్తోంది
నరాల్ని పట్టుకుని కొరికేస్తోంది

నిశ్చలమైన చెరువులో మట్టిబెడ్డ పడి
కొద్దిసేపు ప్రశాంతత చెదిరి

అల్లకల్లోలంగా అలలు కదిలి
అంతలోకే సర్దుకుని నిశ్చలమైపోయినట్టు
సెకండ్‌షో సినిమాలు విడిచిపెట్టగానే
ఒక్కసారిగా నిశ్శబ్దం పగిలి
శబ్దాలు చిచ్చుబుడ్డి రవ్వల్లా ఎగిరి
నగరంనిండా కలగాపులగంగా
రిక్షా మువ్వల చప్పుళ్ళు, సైకిల్ బెల్లుల గణగణలు
కార్ల హారన్లు, కదిలే ప్రజల కలకలాలు
అరగంటసేపు గాలిని అల్లల్లాడించి
మెలమెల్లగా చప్పబడి చల్లారిపోయాయ్
నిశ్శబ్దంలో ఒదిగిపోయి నిద్రపోయాయ్

అప్పుడప్పుడు మువ్వల్ని ఆడించుకుంటూ
ఏ రిక్షాయో మెత్తగా రోడ్లమీద జారిపోతుంది
లయబద్ధంగా మువ్వలు కదిలి
సంగీతంతో గాలిని కుదిపినా
నిశ్చలమైన ప్రకృతి మధ్య
నిర్జనమైన రోడ్లమీద
భయంకరమైన నిశ్శబ్దంలో
స్మశానంలో సర్వీచెట్ల గాలి పాటలా
అగాధంలో రాళ్ళమీద జలపాతం రాగంలా
నాజూకు లేక, మనసుకు ఆహ్లాదం లేక
సోయగం లేక, స్వరంలో సొగసు లేక
మరీ భయంకరంగా విన్పిస్తుంది
ఒంటరిగా వుంటే వెంటబడి భయపెడ్తుంది

ఒళ్ళు మరచి, యిల్లుమరిచి
ఊహ వచ్చింది మొదలు
బేంక్ అకౌంట్‌లా భద్రంగా
మనసులో డిపాజిట్ చేసుకుని

రోజు రోజుకు వడ్డీల్ని పెంచుకుంటోన్న
ప్రాణంమీది తీపి మరిచి, వొంటిమీది మమకారం మరిచి
ప్రాణంకన్న మిన్నగా
డబ్బు సంపాదనే ఒక లక్ష్యంగా
ఆశగా, ఆబగా
పోగేసుకున్న ఐశ్వర్యాన్ని మరిచి, కీర్తిని మరిచి
చుట్టూ మమతల ముడులతో
బంధించుకున్న తనవాళ్ళను మరిచి, పరిసరాల్ని మరిచి
చివరికి తనను తానే మరిచి
ఒంటిమీద తెలివి లేకుండా
ప్రాణం వుండీ లేనివాడిలా
ఇష్టంవున్నా లేకపోయినా
కనీసం నిద్రలోనయినా
సర్వ మానవ సమానతను చాటుతున్నట్టుగా
అందరితోపాటే అందరిలాగే
గాఢనిద్రలో మునిగిపోయాడు మనిషి

పగలల్లా అలసిపోయిన జనం
ఒళ్ళెరుగని నిద్రలో వున్నారు
అప్పుడప్పుడు ఏ నల్లో కుత్తే
చటుక్కున కదిలి మళ్ళీ కళ్ళుమూసి
చీకటి చెరువులో కలల చేపల్ని వేటాడుతున్నారు

జీవితంలో ఓడిపోయిన సామాన్యులకు
రాత్రంతా గేలంవేసినా ఒక్కకలైనా చిక్కదు
నిరీక్షణే తప్ప మరింకేమీ వారికి మిగలదు
మనసుగాలానికి తగిలిన రంగురంగుల కలలచేప
దొరికినట్టే దొరికి
అంతలోకే తప్పించుకు పోతుంది

కలలు సైతంలేని
నిస్సారమైన బ్రతుకే వారికి మిగుల్తుంది

కొందరికి కలలు దొరికినా ఫలితంవుండదు
పాపం ! వారు దురదృష్టవంతులు
వాతావరణం బావుందని జాలరి
చీకటితోనే చెరువులో వలేస్తే
బరువుగా తగిలిందని కొండంత ఆశతో బైటికిలాగితే
చచ్చినశవం బైటికొచ్చినట్టు
దెయ్యాలో, భూతాలో
అంతకుమించిన భయంకర జీవితసమస్యలో
ఆకలి వేదనలో, బాధల బూచీలో
కష్టాలో, కన్నీళ్ళో కలలో కొస్తాయ్

మరికొందరు జాలిపడాల్సిన జీవులు
వారిని కలలే వెక్కిరించి అపహాస్యంచేస్తాయ్
నిజ జీవితంలో అప్పుడప్పుడైనా
ఒకటో రెండో రూపాయలనోట్లన్నా
ఏరోడ్డు మీదో దొరకడం కద్దు
కాని కలల్లో మాత్రం వారికి
చిల్లరపైసలూ, చెల్లని నాణేలూతప్ప
నోట్లెప్పుడూ దొరకనే దొరకవు

నిద్రకి వెలుపల ఆలోచన్లని ఆనుకుని
గతంలోకి జారిపోయేవారు
వర్తమానంమీద సవారీ చేసేవారు
భవిష్యత్తుపైకి ఎగిరేవారు
చెదురు మదురుగా అక్కడక్కడ
నిట్టూర్పులతో రాత్రిని నింపుతున్నారు
కలల అంచుల్ని పట్టుకుని

స్వేచ్ఛగా ఊరేగుతున్నవారు
మెదడు పొరల్లోంచి తొంగిచూసి
మనసు తెరల్ని పక్కకుతీసి
వుండివుండి ఒకోసారి
పలవరింతలతో రాత్రిని పలకరిస్తున్నారు
గాఢ నిద్రలో కూరుకుపోయినవారు
నోటి తలుపులు తెరిచి
గుర్రుపెట్టి గట్టిగా రాత్రిని గద్దించి పిలుస్తున్నారు

ప్రభుత్వ కార్యాలయాల్లో, పారిశ్రామిక వ్యవస్థల్లో
కాపలాకాసే నైట్ వాచర్లు
పగటివేళ పిట్టగూడుల్లాటి ఒంటిగదుల యిళ్ళల్లో
పెళ్ళాంబిడ్డల పోరుతో
చెవులు గింగుర్లెత్తే హోరుతో
పడుకుంటే కంటిమీదికి కునుకురాక
రాత్రయ్యేసరికి బరువెక్కే రెప్పల్ని
టీనీళ్ళతోనో, బీడీ దమ్ముల్తోనో తడుపుకుని
నగరం సందడి సద్దుమణిగేవరకు
బలవంతంగా ఎత్తి పట్టుకుని
నిద్రకు ఆగలేక జోగుతూ
అర్ధరాత్రివరకు ఎలాగోలా మేలుకుని
ఇంటికన్న ఆఫీసే పదిలంగా
అడిగేవాళ్ళులేరని హాయిగా నిద్రపోతున్నారు

రాత్రి పహారా తిరిగే పోలీసులకు బహుశా
పాదాలలో ఆనెలు వుంటాయేమో
కాకుంటే ఎప్పుడోకాని వారు
రోడ్లమీద కనిపించనే కనిపించరు
నిలువెత్తు ఓవర్ కోటుల్లో నిండా మునిగి
బారెడు మఫ్లర్లలో ముఖాల్ని కప్పెట్టి

ఏ సందుగొందుల్లోనో
ఏ గుడ్డి దీపాలకిందనో
ఏ దుకాణం అరుగులమీదో
మహారాజుల్లా బైఠాయించి
కునికిపాట్లు పడుతుంటారు
కాకుంటే యిద్దరూ ముగ్గురూ కలిసి
సిగరెట్ల కాష్టాలతో చలిని కాచుకుంటారు
కొరివి దెయ్యాల్లా కూచుని కబుర్లు చెప్పుకుంటారు
కొందరు అదృష్టవంతులు
ఖాతా యిళ్ళల్లో వెచ్చగా కులుకుతుంటారు

పోలీసుల చేతుల్లో దొంగల జాతకాలున్నట్టే
దొంగల గుప్పెట్లో పోలీసుల ఆనుపానులుంటాయ్
వాళ్ళ అలవాట్లు, అడుగుజాడలు
వాళ్ళ నడవడికలు, కదలికలు
వివరంగా అన్నీ దొంగలకు తెలుసు
వాళ్ళ అలుసునుబట్టి
అక్కడక్కడ వాళ్ళ అండనుబట్టి
దొంగతనాలు, దోపిడీలు
నగరంలో ప్రతిరోజూ
ఏ మూలో ఒక మూల మామూలు

చచ్చిపోయినట్టున అర్ధరాత్రి నగరం
ఎక్కడా ప్రాణి అలికిడైనా లేని స్మశానం
అయినా అక్కడక్కడ నక్కల్లా కొందరు
కన్నాలు తవ్వేవాళ్ళు, గోతులు తీసేవాళ్ళు
నగరంలో నక్కినక్కి కదులుతూనే వుంటారు
నిద్రపోని ఏ గది కిటికీ తొర్రలోంచో
చింత నిప్పు కళ్ళతో గుడ్లగూబలా
ఎవరో ఒకరు ఆకలిగా చూస్తూనే వుంటారు

ఇది స్మశానమే కాదు కారడవి
రకరకాల క్రూరమృగాలన్నీ యిక్కడ
అద్దాల గుహల్లో మాటేసి వుంటాయ్
ఏ అమాయక జీవో దారితప్పి
ఆ అద్దాల గుహల్లో అడుగుపెట్టి
వాటి ఆకలికి బలై ప్రాణాలు కోల్పోతుంటాయ్

గతిలేక అవినీతిని కతికి
పొట్టపోసుకొనే నిర్భాగ్యురాలు
నాలుగు రాళ్ళకు ఆశపడి
మగపురుగుల గదికో, గెస్ట్ హౌస్ కో
బేచలర్స్ క్వార్టరుకో, హాస్టల్ కో
చీకటితోపాటు వెళ్ళి
అర్ధరాత్రి తిరక్కుండా శవంగామారి
ఏ చెరువు నీళ్ళల్లోనో, ఏ రైలుకట్టమీదో
గట్టున ఆత్మహత్య చీటీతోపాటుగా
దర్శనమిచ్చే భయంకర దృశ్యం
నగరానికి వింతకాదు, అది కొత్తకాదు
ప్రతిరోజూ కాకున్నా
పండక్కో పబ్బానికో
దిన పత్రికలో ఏమూలో
ఒదిగిపోయిన వార్తలో
ఇలాంటి పచ్చి పచ్చి నిజాలు
పాఠకులకు గొంతుదిగని చేదుమాత్రలు
అప్పుడప్పుడు యిలాటి మాత్రల్ని మింగడం
పాఠకులకు అనుభవంలోని విషయం

హత్యలకీ ఆత్మ హత్యలకీ
అర్ధరాత్రి పెట్టింది పేరు
ప్రజల నిద్రతెరల చాటున

వాళ్ళ కనురెప్పల వెలుపల
రేచీకటిచట్టం కళ్ళకింద
కాటుక నలుపు ముసుగులోపల
చైతన్యాన్ని పాతేసే
ప్రాణాల్ని ఎగరేసే
హత్యల్తో, ఆత్మహత్యల్తో
అర్ధరాత్రిలో క్షణక్షణమూ నిండిపోయి
ఆఖరికి ఉదయంలోకి సైతం పొర్లిపోతుంటాయ్
ఎవరి వెచ్చని రక్తంలోనో
పిడిబాకో, పిస్తోలు గుండో
తలస్నానం చేస్తుంది
ఎవరి మండే ఒంటిమీదో
కిరసనాయిలో, పెట్రోలో
భగ్గున అంటుకుంటుంది

ఇది అర్ధరాత్రి
ప్రాణంవున్న మనిషివునికన్నా లేని
చీకటి బూడిద నిండిన వల్లకాడు
అంతటా భయంకరంగా
నిశ్శబ్దం పరుచుకున్న బీడు
కుళ్ళిపోయి పుచ్చులు పట్టి
పురుగులు నిండిన పనికిరాని పండు
చలికి చైతన్యం పేరుకుపోయి
గడ్డకట్టిన చల్లని మంచు

ఈ లోకాన్ని మర్చిపోయిన గాఢనిద్రలో
లుంగచుట్టుకుపోయిన తెలివిలో
నేలలో పాతిన విత్తనాల్లా
సమాధిలో మునిగిపోయి
నగరంలో అలికిడి లేక, కదలిక లేక

శబ్దాలు లేక, సందడి లేక
పాడుబడ్డ కోటలా
పూర్వ వైభవాన్ని కోల్పోయి దిగులుగా
మత్తుగా, మసగ్గా
చచ్చిన శవంలా చల్లగావుంది నగరం
ఇక్కడ ఎక్కడా ఏ అలికిడీ వినిపించదు
ఏ వైపునా చైతన్యం ప్రవహించదు
జడమయమైన యీ అర్ధరాత్రి
శిలలా కదలని ఒక స్టిల్ లైఫ్ ఫొటోగ్రాఫు
అందుకే—
నగరంలో అర్ధరాత్రి
జడత్వానికి గుర్తు



# కవి పలుకు

ఈ కాటుక చీకటి
ఈ బండరాతి జడత్వం
ఈ భయంకర నిశ్శబ్దం
ఎప్పటికీ యిలా వుండిపోదు
ఈ చీకటి తొలిగిపోతుంది
ఈ జడత్వం కరిగిపోతుంది
ఈ నిశ్శబ్దం ఎగిరిపోతుంది

కుళ్ళిపోయిన యీ నగరాన్ని చూసి
ఇక్కడ పేరుకుపోయిన అన్యాయాల్ని చూసి
పాపాల్ని చూసి, పాడుబడ్డ సమాజాన్ని చూసి
ఏ వీరుడో ఉదయించి
కిరణాల కత్తుల్ని ఝళిపించి
కాంతిని కురిపిస్తాడు
ఈ చీకటితెరల్ని, మంచుపొరల్ని
నిలువునా చీల్చి చెండాడుతాడు
ఈ జడత్వాన్ని, కల్మషాన్ని
వెచ్చటి చురకల్ని అంటించి కరిగించి
నీరుకార్చి కాలువలుకట్టి పారిస్తాడు

ఈ నిశ్శబ్దాన్ని, భయాన్ని
ముక్కలు ముక్కలు చేసి
కాకులకీ, గెద్దలకీ ఎగరేస్తాడు
ఈ కుళ్ళిపోయిన నగరం శరీరంలోకి
వెలుగు సూదులు ఎక్కించి
ఆరోగ్యవంతమైన ప్రాణవాయువుని
పాడైపోయిన ఊపిరితిత్తుల్లో నింపి
ప్రాణాలు ఎగిరిపోకుండా నిలుపుతాడు
నేలపొరల్లో నిద్రపోతోన్న విత్తనాల్లా
రాత్రి చీకటిలో కూరుకుపోయిన జనత మీద
కాంతినీటిని చల్లి తట్టిలేపి
వెచ్చగా గుండెల్ని తడిపి
కొత్త ఆశల చివుర్లు తొడిగి
తలెత్తి లోకాన్ని చూడ్డం నేర్పుతాడు
అతను సామాన్యుడు కాడు మాన్యుడు
తనకి తానే సాటైన మహా వీరుడు
ప్రజల చీకటి చెరవిడిపించే నాయకుడు
వాళ్ళ బాగోగుల్ని భుజాలమీద మోస్తున్న రక్షకుడు
అతను
వెలుగును నిండుగా నింపుకుని
చైతన్యాన్ని నిలువెల్లా నిలుపుకున్న సూర్యుడు

ఇక్కడ మళ్ళీ వెలుగు వస్తుంది
చైతన్యం నిండుగా పొర్లి ప్రవహిస్తుంది
ఇక్కడ మళ్ళీ ఆశ పూస్తుంది
ఉత్సాహం సందడిగా గెంతులేస్తుంది

# మళ్ళీ వెలుగు

శీల వీర్రాజు